శ్రీ ర స్తు.

# శ్రీ జా న కీ శ ప థ ము.



## హ రి క థ



విజయనగర వాస్తవ్యులును, మహాకవి గాయకశిరోమణులును,
గానవిద్యా విశారదులును నగు
బ్రహ్మశ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారిచే
రచియింపఁబడినది.



ప్రకటనకర్తలు:
వేఁకూరి సుబ్బారావు అండ్ సన్స్
ప్రొప్రయిటర్సు:
సరస్వతి బుక్కుడిపో, బెజవాడ,
కృష్ణాజిల్లా.

మూడవకూర్పు 1000.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1939

 [వెల రు 1-0-0.

# ప్రకటన

1929 సం॥రం ఆగష్టు 23 తేదీన

**బ్రహ్మశ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారిచే**

రచియింపఁబడిన

## హరికథలు.

1 జానకీశపథము. 2 రుక్మిణీకల్యాణము. 3 మార్కండేయచరిత్ర 4 హరిచంద్రోపాఖ్యానము. 5 అంజరీష చరిత్ర. 6 భీష్మచరిత్రము. 7 ప్రహ్లాదచరిత్ర. 8 గజేంద్రమోక్షము. ఈ ఎనిమిది పుస్తకములు సదరు గ్రంథకర్త గారివద్ద పై తారీఖున మేము కాపీరైటుపొంది, కాపీరైటు యాక్టుప్రకారం దస్తావేజు వ్రాయించుకుని రిజిష్టరీచేయించుకున్నాము. ఈపుస్తకములు ఇండియా కాపీరైటుచేతను పరదేశీయమైన కాపీరైటుచేతను సురక్షితమై యున్నవి. మా ఉత్తర్వులేనిదే యెవ్వరైనను ఇందులో ఒకభాగముగాని సంపూర్ణభాగముగాని ఇందులోని భావములుగాని కీర్తనలుగాని యీపుస్తకములు భాషాంతరీకరించి క్రయమునకు యిచ్చుటకుగాని యెవరికిన్ని హక్కులేదు. యీపుస్తకములను యేమాత్రము కాపీ చేసినయెడలను కాపీరైట్లను నుల్లంఘించినట్లగును. అట్టివారు మేము జరుపబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు భాధ్యులగుదురు.

ఇట్లు,

కాపీరైట్లు హక్కుదారులు,

**కురుకూరి సుబ్బారావు, అండ్ సన్స్**

ప్రొప్రయిటర్సు:

సరస్వతీబుక్కు డిపో, బెజవాడ,

బెజవాడ,
ది 1—2—39

—:o:—



# శ్రీ జానకీశ పథము



## హరికథ.



క॥ శ్రీ సీతారామపదా । బ్జాసీనమనోద్విరేఫ యస్ఖలిత బ్రి
హ్మాసనభాసురయోగా । భ్యాసనిపుణ యాంజనేయ పండితగేయా॥

హుసేనిరాగము - చతురస్రగతి.

ప॥ రణధీరా కపివీరా - రారమనుబ్రోవరా వాయుకుమార ॥ర॥

అ॥ గణనాతీత సుగుణాకరా - కామితమందారా సాధువిచార ॥ర॥

మిశ్రము॥ గణించి నిర్గ కృతికర్త - గానేతు దురితహర్త
ఫణీంద్రకీర్తి విహార - పారావారగభీర ॥ర॥

చరణము॥ కారుణ్యామృతపూర - ఘనవార్ధిలంఘనోదార
శ్రీరామార్పితజీవా - సిద్ధైశ్వర్యమహానుభావ॥

మి॥ చారుగానార్ద్రీకృతశిలాతరు - షండ శత్రు భీకరభుజాదండ
నారాయణదాసహృదయతోషా-నవవ్యాకరణ ప్రసిద్ధభాషా ॥ర॥

కలగడా - రూపకతాళము.

ప॥ నీ ధ ప ధా పా రీ - గ ప గ రి రీ సా ॥నీ॥
శ్రీగణనాథా ర - క్షితబుధయూథా ॥శ్రీ॥

అ॥ నీ స రీ స నీ స నీ ధ - ప ధ గా. ప ధ పా ॥నీ॥
నాగభూషభక్తపోష - నగజాతనయా ॥శ్రీ॥

మితశ్రియము॥ గా ప ధ నీ సా రీ నీ - సా ని ధ, పా నీ ధా ప.
బాగుగ నీపాదంబుల్ - బట్టితి విఘ్నేశుండ
సా పా సా ని ధ పా ని ధ - పా గా రీ గ రి పా గ రి ॥నీ॥
యోగీంద్ర స్తుత సద్గుణ - యో గంగాధరబాలక ॥శ్రీ॥

మంజుల - ఖండగతి.

ప॥ సా ని ధ ప మా మ గ రి సా - స రి గ మ ప ధ ని ॥సా॥
అం బకరుణించు త్వరగా నను నో శారద ॥దా॥
అ॥ పా మ గ మ పా ధ ని స నీ - రి ని స రి స ని।
సా ని ధ ప మా గ రి గ సా ॥సరిగరి॥
కంబునిభసుందరగళా యధరవిజిత - బింబ ఘనపాపనిగళా॥ ననునో॥
పా స ని ధ ప మ గ మ ని ధా। ని స ని గ రి స ని।
సా ప ధ ప మ గ రి గ ధ మా ॥సరిగరి॥
పంకరుహనయన వినుమా మనవి కృతి నక -
లంకముగ దయను గొనుమా ॥ననునో॥

సీ॥ ఏజీవమునకైన హింససేయక యుంటయే ధర్మమను దయా
హృదయులార
యెట్టికష్టములైన నిసుమంతయునీతి దప్పని సత్యవ్రతస్థులార
సకలభోగంబుల సర్వేశ్వరార్పణగా జేయు పరమభాగవతులార
యాత్మకంటె న్మరి యర్థంబు లేదని తలపోయు నిశ్చలాద్వైతులార
ధర్మమును విడువని తలిదండ్రులార
సమ్మతముగనడుచు నన్నదమ్ములార
యల్లరులు సేయబోవని పిల్లలార
వినుడు సత్కథ మీరెల్ల వీనులార॥

శుద్ధసావేరి - చతురస్రగతి.

ప॥ మానసమా నీవు-మరువకే శ్రీహరి।ధ్యానముకలనైన-ధరలోన॥మా॥
అ॥ కానిపనుల ముందు - గా దెంపునం జేసి యాపైని దుఃఖించిన -
-ఫలమేమె వెర్రి ॥మా॥

# శ్రీ జానకీ శపథము.

సీ॥ సర్వేశ్వరుడువిలాసమునకై యీసృష్టి సలిపి జీవులకు వృత్తుల విధించి
తనమాయలోనుంచి తాసాక్షిమాత్రుడై జూచుజగన్నాటకసూత్రధారి
యది యెరుంగక జను లభిమానమున నిహకర్మములకు దామె
కర్తలమని
మోహశోకంబుల బొరలుచు సంసారవారినిధిం దరిజేరలేరు
గానపరమేశునాజ్ఞల గడువబోక
దయయు సత్యంబు సుంతయు దప్పిచనక
శాశ్వతానంద పదవికి సాగదలచి
సందియముమాని డెందమా శాంతిబొందు॥

హరి కాంభోజి - చతురస్రగతి.

ప॥ హరిహరిహరిహరిహరియనుమనసా-యన్యచింతనీకేందుకె మనసా॥హ॥
అ॥ దురితమికనైన మానవె మనసా-దూరాలోచన సేయవె మనసా ॥హ॥
మి॥ పరభామలవలసివలపించిమరి-వారిభర్తలకు బరితాపము లిడి
మరణశంకబడి శోకించునిన్ను-మన్నించు దేవుడు దయాబ్ధిగాన ॥హ॥

1. తెలిసి తెలియకుంటచే నీవిట్టు-దిగులు జెందెదవే వెర్రిమనసా
పలుమరికనైన దెల్వి దెచ్చుకొని-పశ్చాత్తాపముబడవే మనసా
చలనంబెప్పుడైన విడువవుగదా-కలనైన న్వాలితి మానవుగదా
నలలితయౌవనభోగభాగ్యములు-కలకాలము సతములని యెంచకే॥హ॥

సీ॥ తెలియనిసుఖదుఃఖములుబొందికొన్నాళ్ళు పొత్తిళ్ళలోబడిపొరలినావు
తలిదండ్రులకుదప్ప వెలిలోక మెరుగక తప్పటడుంగుల దారినావు
కొన్నాళ్ళుపిమ్మటంగోతిచేష్టలగల్గి దుడుగుదనంబున ద్రుళ్ళినావు
అటుపయిగొన్నాళ్ళు లడియాసవలపున గడుమోసకత్తెలందడవినావు
ఇప్పుడెరిగియు నెరుగక గొప్పకొరకు
వ్యర్థసంసారమున దేవులాడెదీవు
ధరణి నీమీద నేమి కాదలచినావొ
చాలునికనైన డెందమా శాంతిబొందు॥

కనకాంగి — త్రిపుట.

ప॥ ప మ ప ధ నీ సా ని ధ ప మా గ రీ సా - స రి గా రి గ మ పమ॥ప॥
హరి భజనస్సేయుదము మితుర్లారా-సరిగా నిపుడు హరి ॥భ॥

అ॥ రి స ని సా రీ గ మా ప ధ పమ - ప ధ ని సా రి స నీ ధ ధ పమా॥ప॥
సుజనులారా తరించుట కిది-సులభమార్గము సుండి తలపగ
ప ద ప సా రి స గ మా గ రీ స-నీ స ని రి స ని స ని ద ప మగమ॥ప॥
నిజముగా సకల ఘోరదుఃఖ-నిర్భరమగు భవనమున బొరలక ॥భ॥

1. ప మ గ రీ స రి గా మ పా ధ ప-ధ నీ సా రి ని సా రి గా రీ॥
సకల సంపద లస్థిరంబులు-జగన్నాధుని భక్తి దక్కగ
స రి గా మ ప ద నీ స రి స నీ-స ని ధ పా మ గ రి సా మాపమ॥ప॥
ఇక నేల మన కిచ్చకము బూ-టకముదంభులకడగ శ్రీహరి ॥భ॥

సీ॥ ధనముకావలసిన దంభములో స్సేసము ల్సేవ లిచ్చకములు సేయవలయు
కామసంతృప్తికై కాంతలకున్ లొంగి కానిగడ్లను గరువవలయు
స్వకుటుంబవృద్ధికై వ్యయముప్రయాసంబు బడియాత్మ సౌఖ్యంబు
వదలవలయు
పేరొందుటకు బెద్ద వేషంబులంబెక్కు దేశంబులం దిమ్మదిరుగవలయు
అల దిగంతపురేఖ యట్టులను మదికి
జేరునైతోచి సంతుష్టి దూరమగును
దుఃఖమే మిగిలియుండును దుదకుమనకు
గాన నిహభోగములపయి గాంక్షతగదు.

ఘంటారవము — త్ర్యస్రగతి.

ప॥ స గా గ మ ప నీ స-స ని ధ ప మా గా రీ స ॥స॥
హరిగ గొలుచుకొండీ-యఘమొదలంజెండీ ॥హ॥

అ॥ రి సా ని ధ ప మ గ మ ప నీ-స నీ ధ ప మ గ రి స సీ ॥స॥
తరించుటకె దెగతిసుడీ-త్వరన్ని జమువైలియుడీ ॥హ॥

1. ప ని ధ ప మ గ రి స రి నీ-స గ మ ప ధ ప మ గ రి సా।
సకల జగమిది కలపో-లిక మృషయని తెలచుడీ।

ప స ని సా రి ని స గా మ ప మ నీ-స ని ధ ప మ గా రీ స రి ని॥స॥
ప్రకృతికంతటికిగారణము ని-త్యనిరుపమ తేజోమయుని ॥హ॥

2. గా మ ప మ గ పా మ గ రి స-నీ ధ ప మ ప ని ధా పా।
ఎందుకు వెయినిష్ఠలను మ-రెందుకు జపతపంబుల్
మా ప ని స ని గా రి స రి ని-సా ని ధ ప మ గా రి స ని ॥స॥
సందియమునుమాని సరిగ-సత్యమెపుడు వాకొనుము ॥హ॥

సీ॥ సకలపండితులచే సన్నుతిబొంద సత్యంబుకంటెమరి సాధనములేదు
విధికృతంబులగు దుర్వ్యధలుతప్పింప సత్యంబుకన్న స్వేరు దారిలేదు
పాపాత్మకులుచేయు బాధలనడగింప సత్యంబునకుమించు శరణలేదు
ఘోరునసంసార ఘోరరోగముమాన్ప సత్యంబుదక్క నౌషధములేదు
దుష్టసంపర్కమున దురదృష్టమునను
గల్లనిందెనుబొంది యిక్కట్లువడియు
సత్యవంతులు తుదకు బ్రశస్తకీర్తి
జరుగుదురు గర్భవతియగు జానకివలె.

సామవరాళి—రూపకము.

ప॥ స రి మ ప దా నీ సా - స ని ద ప మా గా రీ సా ॥స॥
అకట కటాకష్టం-బధికము సత్యాత్ములకే ॥య॥

అ॥ రి మ రి ప మ ద నీ రి నీ-స ని స ధ ని ప దా మ గా రి ॥స॥
ఒకటయి డయినన్సుఖం-బొదవెనె సీతారాములకు॥ క॥

మ॥ ద పా మ గ రి సా రి మా - ప దా ని స రి గా రీ మ ప।
ఇకేమనెద బెండ్లియా-డుకొన్న మొదలాదంపతు
-మ ధా ని సా రి గ రి సా ని - స దా నీ ప దా మ గా రి ॥స॥
లకబ్బు దుఃఖ-ములబాధ-లకున్మేరలేదుచూడ ॥అ॥

సీ॥ పరిణయంబై నట్టి మరునాడె జానకి రామునితోడ నరణ్యమునకు
మామపంపునబోయి ఘనగడు చెంగట లేనితరి దశకంఠుచేతను జెరబడి
పదినెలలటుతన పతిజాడ దెలియక పిదపబుణ్యంబున విభునిగలిసి
తనదుపాతివ్రత్యమున కగ్నిసాక్షిగానధిపుతోడ నయోధ్యకరిగియచట
హాయిగా గొన్ని యేండ్లు పట్టాభిషిక్తు
డయిన పెనిమిటితోనుండి యంతవట్టి
నిందబడి యాసతీమణి నిండుచూలు
సమయమునబొందె దిరిగి గష్టంబులకట.

వనస్పతి—ఖండగతి

ప॥ దా ని సా ప ని ద ప మ-గా రీ స ని ధ ని స ని । దా
జానకీశపథము స-దానందశుభపథము ॥జా॥

అ॥ రీ గ మా ప ద నీ ధ-ప మ గా రి సా ని ధ ని । దా
మానవంతులకెల్ల-మహిలో నిదర్శనము ॥జా॥

మి॥ గా మా ప ధా ని ధా-గ రి సా నీ దా మా ।
జ్ఞానప్రదంబు స-జ్జన సమ్మోదంబుగ
గా ని ద ని స ని రి స ని-స గ రీ స ని ద ని ద ప । దా
గాన వినుడుచరితము-కరుణారసభరితము ॥జా॥

సీ॥ వైదేహితోగూడి పట్టాభిషిక్తుడై రాజితకీర్తి శ్రీరామమూర్తి
శిష్టరక్షణమునుదుష్టశిక్షణమును సేయుచయోధ్య లోహాయిమీఱ
నేలుచుమహికెల్ల గృతయుగధర్మంబు జరుపుచునొకరేయిశయ్యమీద
శతకోటిమన్మథసౌందర్యమూర్తియై పట్టుటెక్కెమునానిపవ్వళించి
పక్కలోపలబూర్ణగర్భంబుతోడ
దొడరికూర్చున్న యిల్లాలికడుపు చేత
బ్రేమగా దడుముచు ముద్దుబెట్టుకొనుచు
మందహాసంబునంబలెక్కె మంతనమున.

## నాగానందిని—చతురశ్రజాతి-త్రిపుట.

ప॥ ప మ ధా ని స ని రి ని స ని దా ప దా - పా మా గ మ గ రి గా
మ ప మ గ రి స ॥ప॥
పరమాత్మునికృపవలనహాయిగా-బ్రాణేశ్వరి మనముంటిమిదివరకు॥బ॥

అ॥ ని రి ని స నీ దా పా మ గ రి స నీ - స రి గమ ప దా ని స ని
ధా ప మ గ మ ॥ప॥
బిరబిరసత్సంతానము గనుమా-పితౄఋణముదీరమనవంశమలర ॥ప॥

చ॥ రి గ మా ప దా నిసా నీ స రి గా-మ గ రి గారిగామాపదాసీ॥ప॥
పరిమార్చినాడదుష్టాసురుల-ధరణియెల్లనిష్కంటకంబయ్యె
ద ని స నీ దా ప మా గ రీ గ మ ప - దా ప మ గ రి పా మ గా
మ రీ గ మ ॥ప॥
తరుణినీకోర్కెనిండుగర్భిణివి-దాచకచెప్పుమెద్దియైననిచ్చెద ॥ప॥

గీ॥ అనినవిని ప్రాణనాథునియాస్యకమల। మందుజానకి దృగ్భ్రమరాళిఁ జరపి
వినయమున్సంతసంబును జనువుమీఱ । ముత్తెముల్గెంపు లొల్కఁ
నిట్లొత్తిపల్కె.

## ఝంకారధ్వని—రూపకము.

ప॥ సా రి గా మా గ రీ స - నీ స రీ గ మా ప మ గ రి ॥సా
ఏమినాపుణ్యమిట్టు-లీవుకోరుకొమ్మనియెద ॥వే॥

అ॥ సా ని ధా ప మా గ రీ గ-పా మ గా రి సా ని సా రి ॥సా
సామినీకటాక్షమున్న-జాలదాయికేకోరంత ॥యే

చ॥ నీ స రి నీ సా రీ గ రి-దా ప మ ధా ధా ప మా॥
వేమరునీపాదంబులె-నామదికిందోచని॥

గా రి గ మా పా మా గ రి-స నీ ధ పా మా గ రి నీ ॥సా
కామితమందారాత్రిజ-గదేకవీరాభళిరా ॥యే

1. నీ స నీ రి గా మ గా రి - పా మ గా మ × రి × ధా ॥ప॥
ఐననామనోహరుండ - .యంతముద్దుజరిపె దేని
నీ ద ని ప ద ని స రీ × రి - సా ని ధా ప మా గా రి స
కాననమున మునిభార్యల - గాంచు వేడ్క జెల్లించుము
నీ సా రీ × మ ప మ × రి - నీ ద పా మ గా మ × రీ
సేనప్పుణ్యాసతులకడ - నెమ్మితో డసత్కథల
సా ని స రీ ని సా రి × రి - మా × రి గా పా మా × రి ॥సా॥
వీనులవిందు సేసికొని - వేగమె నిర్దశించెద ॥నే॥

గీ॥ అనిన నంగీకరించిన యధిపుచెంత। గొంతవడికిపి ద్రించెనకోమలాంగి
పిదప శ్రీరాముడుంబూర్వవిధిబురంబు। తెరవులందలి జనులశోధింప నేగె॥

ఉ॥ వాయుతనూజసంతత నివారిత దుష్టసమాజసర్వస
ద్నాయకముఖ్యరామ పదకంజనిరంతర బద్ధసఖ్య సు
శ్రీయుత కామరూప రవిశిక్షిత వేదకలాప ఘోరలం
కాయతనాగ్ని సాయక సమాశ్రితసంచయ సౌఖ్యదాయకా॥

పంచచామరము॥ సముద్రలంఘన ప్రతాపశాలి గాయకోత్తమా
విమత్తలంకిణీ లతాలవిత్ర సాధుసత్తమా
సమస్తవేదశాస్త్ర సంవిశారదాశ్రితావనా
సమీరపుత్ర రామనామసార నిత్యజీవనా॥

వ॥ అవధరింపు మొకభటుండుమాత్రము వెంబడింప, దుష్టశిక్షణశిష్టరక్షణాదక్షుండగు శ్రీరామచంద్రుండు-మారు వేషముతో భూలోకమునకై స్వర్గమువిడుచునట్లు క్రమక్రమముగా సౌధాంతరములనుండి క్రిందికిదిగి నిశీథసమయంబున గోట కావలివారల జాగరూకతంబరిశీలించి - సింహద్వారంబు వెడలి-యగడ్త వంతెనం దాటి- నానావిధ ఫలవృక్షంబుల వరుసలకు నడుమనున్న ని వెడలుపు తిన్ననిరాజవీధియందు జీమకైనన్నొప్పికలుగని యంత మెల్లగ గడియకొక యడుగు వేయుచు గొద్దివస్తువునైనగొప్పగ గణించుత మచిరుతచూపుల సహజౌదార్యగాంభీర్య శాంతభావంబులొప్ప

రమింటిమబ్బుల వెడద చెవులం జెదరజిమ్ముచు దమహృదయనిర్మలత్వముం దెలుపు దంతకాంతులు దిక్కుల న్వెన్నెలలుగాయ-నల్లపూసనైన శోధించి నిమిషోపాయంబునం బట్టజాలుతుండాగ్రంబున నేలదుడుచునట్లు పూత్కా-రించుచు- దెసలదరఘీంకరించుచు- నెట్టికష్టంబులైన సహించి యల్పులకు లొంగియైన లోకోపకారంబుగా నడచుటయే జన్మకుసార్థక మనునట్లు మావంతులవశంబున మేనులంబట్టు కత్తళంబులనలంకరింపబడి - యెందైనం దమయౌన్నత్య బలపుష్టులకుసాటిలేదని యిరుప్రక్కలం జయఘంటలుమ్రోయ- నూగుచుం బిల్లకొండలవలె నడతెంచు నేనుంగు లవ్వెనక-శాయమానాన్వలకిముందుబొంగులవలె నిడుదవంక మెడలెత్తి కురూపిత్రిప్పుకొనుట మెండన్నట్లు మొండిచెవులతోడి చిన్నకోలతలలనాడించుచు-దమయందమే జంతువులకైన లేదని నిరసించు దీరున వ్రేలాడు పెదవుల నాకసంబుచప్పరించుచు - నెట్టిబరువుతోనైన నామడలడుంగులుగ నడువగల మనుగవర్ణంబునందూగివచ్చు బేగిరావు-లాపిదప వింతచాజ్జా మాలతోరబ్బురుబంతులవలెద్రుళ్ళుచు నబ్బురపునడలను డాంబాజీలు సేయుతురుపుగుర్రంబు-లాపిమ్మట నొకచో మహాతాబు- లొక్కెడజిచ్చుబుడ్లొ-కటదారాజువ్వా-లొక్కప్రక్క యీతచెట్లొక్కతావున నెగురు కాగితపుబుట్టలొకచెంత వెన్నముద్ద లొకవైపున నాట్లొకమూల జక్రంబులు మొదలగు పలురకంబుల బాణసంచా-లాతరువాత పటా-చెడీదమ్ఖుసరత్తుదొట్టి గరిడీ సాము-లాపయి రమ్డోలు వీరణము, తాషా- టకోరా-సన్నాయి-తూతూబాకా మొదలగు పెక్కురకంబుల బాజాబజంత్రీవాద్యము-లాపై నిత్యకన్యాత్వము-నిర్మలదృష్టియు-సంతత పరమేశ్వరసేవయు వాసికెక్క సారంగి తపలా దొట్టిమధురధ్వనుల సహాయంబున భక్తిరసముట్టిపడ జగదాహ్లాదకరంబుగ బాడియాడు దేవదాసీమణులవ్వలవింజామరలువీచుచు గర్పూరపుదివిటీలుపట్టుచు-వేదమంత్రంబులు చదువుచు బవిత్రవస్త్రంబుల నొప్పుబ్రాహ్మణోత్తములుమోయు బంగరుటందలంబున వేంచేసియున్న గౌరీశంకరవిగ్రహంబులదివ్య వివాహమహోత్సవంబునకుబూర్ణ కలశంబులంబట్టి రాజహంసలగతివచ్చు పతివ్రతామణులు-చిట్టచివరకు దేవకార్యపరులగు పురమందలి పిన్నపెద్దలంతయునూరేగుసంబరముగావించు వేడ్క-

కద్భుతానందములొంది- ఫెండియు నెల్లవీధులు సందులు మూలలు తిరిగి యందందనూరికాపులయష్ట్రిమత్తతకు సంతసించియాంతటంజొడుబుగ్గిదిబ్బలు ముంటికంపలమోపులుపలురంగులతడిపొడిబట్టలమేటులు-బూడిదెపెంటలంబొర్లుచు-దాంపత్యవైభవంబున నొండొరులందన్నుకొనికొట్లాడుచు నారోహణావరోహణానుసారంబుగ విలంబద్రుతకాలంబుల నకలశ్రోతృహాస్యజనకంబుగ గూయుగాడిదెలుగలచాకలిపేటలోబోవునప్పుడొకచాకివాడు తనభార్యతో వక్ష్యమాణంబుగ జగడమాడజొచ్చె॥

బలహంస — చతురశ్రగతి.

ప॥ ధా సా రీ మా ప ధా సా, నీ ధ మా। పా ని ధ సా ని ధ నీ ధ ప మ రి మ గ సా ॥ధా॥

ఓసీయోమాయలాడిచాలునీ-వేసము మోసము-వెల్లడిగదెలిసెనే ॥యో॥

అ॥ ధా స రి మ రీ మ గా సా-నీ ధా ప మా ప ధ స। రీ మ పా మా ప నీ ధ-పా మ రి మ గా స నీ ॥ధా

నాసెలవు లేక నీక-న్న యింటికేగితివి। నాకునీమీదనింక-నమ్మకము లేదు పో॥యో॥

1. ప న్ని ధ మా ప ధ సా ని-ధా ప మా రి మా గ సా రి। స న్ని ధా స రి మ గా స-రీ మ పా ని ధా ప ధా మ ॥దా॥

బల్లలపండుగకీత-కల్లుద్రాగినిన్నుకోర। వల్లగాదనుచునీదు-చెల్లియింట దాగలేద ॥యో॥

సీ॥ అనుచుగోపింప వాకిటకాలినీడ్చి
పొమ్మనినవానితోడ రాముండునూరి
కాపువలె నడ్డపడియోరిపాపమగును
వదలకుముభార్య ననవాడు పలికెనిట్లు.

మేఘరంజి - త్ర్యశ్రగతి

ప॥ సా రి గ మ ని స రి ని సా రి-గా మ ని స రి నీ మ నీ ॥సా॥

మంచితగవరివలెనీవు-మధ్యబడితి వేమయా ॥మ॥

అ॥ సా ని మ గ రి గ రి స నీ స-రి గ మ నీ స నీ మ గా రి ॥సా॥
ఉంచుకొనుటతగునెదీని-యొరులయింటజేరుదాని ॥మ॥

మి॥ నీ స రి గా మ నీ మా గ-రీ స రీ ని సా రి గ మా గా మ నీ
స రీ ని సా రి-సా ని మా గ రీ స రి నీ ॥సా॥
ఎంచగరావణుండొద్ద-నుంచుకొన్న సీతనుబి। ల్పించినిందెమోసియేలు -
వెర్రిరాముబంటువాహహో ॥మ॥

1. సా రి గా రి గా మ గా రి-సా రి స నీ మా గ మ ని రి
దుడ్డుగల్లుగొప్ప వారి-దోసములెక్కింప రెవరు
గా మ నీ మ నీ స రీ ని-స ని మా గ రి గారి సా ని
గుడ్డలేనిపేదవారి-కులమెంచగ పెద్దలంత
సా రి గ మ గ మా ని సా రి-గా మ నీ స రి గ మా గ। మా ని
స నీ స రి గ.మా ని- సా ని మ గా రీ గ స రీ॥ సా
అడ్డపడకుమాటబొందినట్టియాలిపొందికేల।సడ్డగపౌరుషములేని- సంప
దనాతెడ్డునకా ॥మం॥

గీ॥ పంతమున దొడలపై నిడి వాడుదొంగి
లించికూటమిగోరి పెక్కేడులింట
నుంచుకొను నాలి మళ్ళి రప్పించిరాము
డౌరయిట్లాడువారల న్నీరబెట్టె.

క॥ అసవినిసిగ్గువడిగిరు
క్కునరారాముండు కోటకున్మళ్ళిభరిం
పనలవిగాని జనులనిం
దనుగూరిచిలోననిట్లుతల్లడమందెన్. . .

## రాగవర్ధని - రూపకము.

ప॥ సా ని ధా ని దా ప మ గా - రీ స నీ ధ ని స రీ స ని ॥సా॥

ఏమిసేతుదైవమనే - నిట్టినిందెకెటుసైచెద॥ నే॥

అ॥ గా మ ధా ప ధా మ పా - ధా ని సా ని ధా ని రీ॥ సా॥

భూమిజాతయగ్ని సం - పూతయయ్యుమచ్చుహో॥ దే॥

ఖం॥ రీ స ని ధ ని స ని ధ ని ధ మ - పా ధ ని సా ని రీ సా ని

నీమముగల రఘుకులమున - నేనపకీర్తిపాలైతి

రీ గ మ పా ధా ప మా గ - రీ స ని ధా ని స ని ధ సీ ॥సా॥

పామరులుంగూడనన్ను - బల్చనజేసిరియకటా॥ యే॥

1. సా రీ స ని రి స ని ధ ని ధ - ప మ గా మ ప ధ ని స ని ధ ని

ప్రాణేశ్వరినెడయనగున - యపవాదముబడయదగున

సా రీ గ మ ద ప మ గా మ - నీ ద ని సా ని ధ ని రీ

నేనెందుకు బ్రతికినాడ - నిందితకర్ముడనయో

సా రీ గా మా పా ధ ప - మా ప ధ నీ సా ని ధ నీ

భూనాథుండేగహీనత - భోగములాసించినచో

రీసనిధనిసనిధపామా - గామాపధనీసనిరీ॥ సా॥

పూనియతనిప్రజలుధర్మ - ముందప్పుటసంశయమా ॥యే॥

సీ. అగ్గిచెదంబట్టునట్లయోనిజసీత వట్టినిందంబడవలసెనిట్ల
పరగృహమందుండి మరిభర్తలంజేరి స్త్రీలుజానకిసాటిచెప్పుదురింక
భార్యపై వలపున బౌరుషమున్విడనాడితినసుమాటనేడువింటి
సకలంకసూర్యాన్వయమ్మున బుట్టిననాకునిందితస్నేహంబు నెరపరాదు

పాణిపదమైన భార్యను బాయగలన
యిలను ఘోరాపకీర్తి సహింపగలన
కటకటా ముందునూయి వెన్కకునుగోయి
యెద్దియుం దోచకుండె నేనేమి సేతు॥

క॥ ఈనిందకోర్చి నన్నా । జానుమతో ధర్మయన్న ట్లుపకీర్తిక్
మానుకొనరు ప్రజ గానన్ । బ్రాణేశ్వరి నెడసి కష్టమైనసహింతున్.

గీ. తానుకష్టంబుపడియైన ధర్మపథము
వలదుతప్పింప బ్రజకు భూభర్తగాన
నిందబోగొట్టుకొనుటకై నిశ్చయముగ
భూమిజయునేను విడబడి పోగలవలయు.

ధవళాంబరి - జంపెతాళము.

ప. ప మ గ మా పా ధ ని స - రీ స రి ని ధా ప మా ప॥
అరయమారాచబ్రతు - కందరికిబెల్లమే॥ య॥

అ॥ ప ధ నీ ధ పా మా గ - రి స నీ స రి గ దా మ॥ ప॥
యిరుపేదయేమేలు - పృథివీవిభునికన్న ॥న॥

మి॥ స ని ధ ప మా గా రిస - ని స రీ గ మ పా ధ ని
ఇరువురకుందాల్లిటి - యెడబాటను గాయము
స రి గ మా నిధ ప మ గ - దా మ గా రి గ మా॥ ప॥
పరగమానియునిపుడు - పచ్చిజూపినయో॥ య॥

చ. బలిమిని రావణుండు తనుబట్టి గృహాంబుననుంచుకొన్న య
వ్వేల బెను మంటలో దుమికి పావనతం గనుపర్చి వచ్చు నా

నెలతకు దప్పులేదు కలనిందెను దెల్పినచాకికెగ్గులే
దోలరియుజావకేబ్రతికి యుండుటనాదగు నేరమారయన్.

గీ. పఙ్క్తిముఖుచేత మున్ను బాపబడినసీత
చిచ్చుమెప్పించి తిరిగి నన్ జెందునట్లు
ఇపుడు లోకాపవాదము నెడసితన్ను
బౌరులందరుమెచ్చినన్ జేరుకాంత.

క. అనికృతనిశ్చయుడై ల
క్ష్మణునిం బిలిపించి వేగుజామునలజ్జా
వనతముఖుండై రాముం
డనియెనొకంతటికి ధైర్యమూనుచు నిటులన్.

సీతిమతి - త్రిపుటతాళము.

ప॥ సా రి గా రి స నీ స రి గా రి-పా మ దాం పా మ పా మ గా రి నీ ॥సా॥
వింటివా యనుజామనకెంత - వింతఘోరాపవాదవచ్చెనో ॥విం॥

అ॥ ధా ని సా ని ధ ప మ ప ధా ప మ - గా రి గా మ ప మా గ రి
గ రి స నీ ॥సా॥
కొంటెరావణుడటులదా జెర-గొన్న సీతనుదెచ్చితినటయహా॥ విం॥

చ॥ ధా ప మ పా ధా ని సా నీ ద - నీ స రీ గ రి గ మ ప మ ధా ప
ఒంటిగనీరేయినే రాచ-బంటుభంగిబురమునజరింప
ధా ని స ని ధ పా మ గా మ ధా - నీ ధా ప మ గ రి స ని స
గారిసరిని ॥సా॥
తుంటరియొకచాకివాడునా-తో బౌరులిటులనుకొనుచుందురనియె ॥విం॥

1. సా ని సా రి నీ సా ని ధా పా మ ప మ ధా ని స రీ ని సా రీ
ఎన్నడైనలోకాపవాదం - బెరుగబోవనిసూర్యవంశం
సా ని ధ ప మ ప మ గా రి గ రి - సా ని సా రీ గా రి స రి ని
బిన్నదినములకునావలన - నిట్టినిందౌ బొందవలసె

రీ గ రి సా రి నీ స నీ ధ ప - మా పా మ పా దా ని స ని రి ని
ఎన్నగలోకమెల్లనిండిన - యీనిందపోగొట్టుకొనుటకు
సా ని ధ పా మ గ రి స ని స రీ - సా రి గ మా పా దా నీ స రి నీ
దెన్నికసీతనువిడుచుటయే - తెల్లముగాగతవ్యంబకటా॥ వి॥

సీ. నిన్ననన్నుంగోరుకొన్నదిజానకి మౌనికాంతలజూడగానవమున
కరుగవేడుకపుట్టెనంపించుమని నేను నంగీకరించితినట్లుసేయ
గావునదక్షణంబీవుమారాడక పగిలచుతోడ సీవదినెసడవి
కిప్పుడుగొంపోయి బూపిపల్లెచెంగట విడువుమరియునప్పడతితోడ
రావణాసురుచేత జెరంగొనఁబడి
నావనుచు నిన్నుజనులు నిందనుపలుపగ
నాథుడోర్వక నిన్విడనాడెననుచు
దెల్లమొనరించి వేగమెమళ్ళిరమ్ము.

గీ. అనుచుసర్వజ్ఞుడౌతనయుఁగ్రిజుండు
సేయునాజ్ఞకు దలయూచి చిత్తమనుచు
ధరణిజాతనుగాంచి యాదలనువంచి
దుఃఖము నడంచి యిట్లాపెతోడననియె.

సుచరిత్రి - చతురస్రగతి.

ప॥ ధా ప మ గ మా పా ద ని ధా ని స - రీ స నీ స రి స ని - స ని
స రీ స రి నీ॥ ధా॥
అమ్మావినుమాయన్ననుగోరిన-యట్లునిన్నడవికి-ననుపవచ్చితినో ॥య॥

అ॥ గా మ ప మా ప ద-ని స ని రీ స రీ-సా ని ధ పా ద మా-పా మా
గ మ నీ॥ ధా॥
సమ్మతిగామునిసతులతోడనీ-విమ్ముగగొంతకా-లమ్ముండుదువు రా॥య॥

ఖ॥ సా రి గ మ ప మ ప ద నీ స రీ స ని - స ని ధా ప మా ప గా
మా గా రి స ॥
సమ్మదముగసవతిలేనిరాణివి-జగదేకవీరుడౌ శ్రీరాముస॥

రీ గ మ ప మా ప ధా ని స రీ సీ-స ని రీ స ని ధ ప మ గ మ ప
ధా మ గ॥ దా॥

కిచ్చుమహీనయోనిజాతవుసీ కే-యొడనైనగొరతగల దె-సతీమణి॥ య॥

ద్విపద॥ అనవినిజానకి యప్పుడులక్ష్మణుని।
క్షణముండుమనివేగ స్నానంబుసేసి।

2. వెలియుముడుపుంగట్టి వేళ్లిస్నగవేసి।
పాలుపుగగుంకుమబొట్టును బెట్టి।

3 గౌరికి పూజలు గావించిమురసి।
త్రో రథమెక్కి సంతోసంబుమీర॥

వ॥ అంతనాయరదంబు వాయువేగంబునంబోవుచు నెడనెడనానా విధ పక్షికూజితంబులంజెలంగి పూవుపిందెదోరపంటకాయల నొప్పారిన జనహృదయంబుపోల్కిదమోభూతంబై లోపుదెలియరాపెందోటలును జుట్టునకుంబిల్లవరుసబోలి చుట్టువెలుంగుబలియు పేరాముదపుచెట్లకు నడుమదొలుతదలవంచి కష్టపడినంగాని సులభజీవనముదొరక దాపై నౌన్నత్యంబుజూప వచ్చునన్నట్లు సంసారులపోల్కి వంగిలేచుచు సుఖదుఃఖంబులంగిరిపడునేతంబులు దమగుత్తదెల్ప సాధుజెండంబులవలె సిగూఢంబులయ్యు బరోపకారంబుగ బరిణమించు నూతులదాపున బలుతెన్నులనిరుదట్ల బలురకంబుల కూరపాదులంబెంచుచుం బాగుకాలువవేళ్ళం బెరుగుచు వరుసలుగట్టి తమతీయని పసిడిమేనులక వెల్లయాకుటుడుపులం జుట్టుకొని ముత్తైదులవలె బైకిపచ్చనికోనలు మాత్రమగుపరచు చెఱకుపెరళ్ళును—వేసంగిపైరులకై మిగిలిననీటిగూడలందొడు పొలముకాపులదిట్టుచు బురదనత్తుకొను చేపల నీసడించిపెల్లలు పెరుగుముసలిచెరువు గర్భంబుల మొండియూరుదుబ్బుల కెగబ్రాకనత్త యొండ్రికాయల బొడుచుకొని తినుగుడ్డికొంగల నెద్దుచాటుననుండి పడమోదు వేటకాండ్ర కూళతనంబునకు బదులుగ వానియడుంగులం గుచ్చుకొని కదలనీయక వానింబడకుడోడే

చుచు వయసుమళ్ళిన మనసుమాడ్కి దుర్లోరుగకపరిసన్నంబై యుబ్బు మాని సన్నవడి మెల్లగ భారు నొక యేటికవ్వలి యొడ్డుచేరినంత.

సీ. ఆకైననల్లాడ నీకదిగ్బంధనముగ గాలిచెమ్మటంబొాదవెనుకకు
మిన్నంటిచల్వకై మెలపుతోడుత గ్రిద్దచాలుగనిరు ప్రక్కజాచెరెక్క
ముంగాళ్ళతో జెట్టు మొదటగాతర్త్రవ్వికుదురుగబడుకో నెగుంటనక్క
యెండమావులగాంచు చెంతయుదప్పితో వాడిపరువువెట్టెలేడిబక్క

గీ. యొడళులుడికెత్తి తుమ్మెదలుడిగెసద్దు
రగులుకొనునగ్గికిం గనరాదుహద్దు
అడవిపందికి బురదనీరయ్యెముద్దు
వెలసెబనిరద్దు నిడువేసవినడుపొద్దు.

గీ॥ అంతలక్ష్మణుతో సీత నచ్చటముని
పల్లెకుంగూత మేరను బండినిల్పి
స్వాదుఫలహార మొనరించి సేదదేరి
ప్రేమమీారగ నిట్లనె రాముదలచి.

## నవనీత—త్రిపుట.

ప॥ గా మా పా ధ ప మా ప మ గ రీ-స రి స నీ సరిగామాపామా॥గా॥
అన్నాలక్ష్మణనాదుకుడిక-న్నదరజొచ్చెన దేమోకాని ॥య॥

అ॥ పా ధ ని సా రి స ని స ని ధ ప మ గ-మ ప ధ నీ స ని ధా మ
ప మా ॥గా॥
తెన్నునగూాడనపళకునములయి-దిగులుపర్చెనునాదుమదినో॥అ॥

మి॥ సా ని ధ ప మ గా రి సా రి నీ-సా రీ గ రి స నీ రి నీ స ని॥
సన్నుతగుణశాలివైనసీ-యన్నవ్విడిచియిట్లువచ్చితి॥
గా మ ప మా ని రీ స గా రి స-ని ద పా మ ప దా ని స రి స నీ॥
వెన్నెలమాని చీకటింబడి-వెతజెందుచకోరము వలెనో॥య॥

1. ద ప మ గా మా ప ధా ని స రి స-నీ స రీ స ని ధ ప మా గ రీ।
అరయగానాడబుద్ధిమిగుల-నల్పమైనది గద్ధ కానిచో
స రి ని గా మ ప దా ని స ని ధా-ప మా ప ధ నీ సా ని ధా పా
వరుని బాసియరణ్యమునసం-చరింపగ నే గోర నేలా॥
ధ ని స రి సా నీ ధ ప మా ప ధ-మ ప మా గ రి సా రి నీ స గా
సరిసరిచాపల్యము స్త్రీలకు-సహజంబనుమాట నిక్క-మా॥
మ పా ధ పా ద ని స ని ధ ప మ ధ-పా మా గ మ గా రీ స రీ ని॥గా॥
భరింపజాల విరహము మరల-బ్రాణేశునితో నన్ను గూర్పు ॥మ॥

గీ. అడవిమునికాంతలం జూచు నాసవదిలె
నెండబడలిక వాయ నిద్రింతుకొంత
యింటికిన్మళ్ళిపోదు మంచింతిక న్ను
మూయగని లక్ష్మణుడు తలపోసెనిట్లు.

కోసలము-రూపకము.

ప॥ స ని ధ రీ స రి స ని ధ పా-మా ప మా గ మా ప ధా ని।
అకట యీమెకు గఠినరా-మాజ్ఞ నెట్లు తెల్పువాడ
అ॥ రి స నీ రీ స నీ ధ ప మ-పా ద ని స ని రీ సా ని॥ స॥
నికనా ఘోర వార్త-విని-యెట్లు బ్రతుకు నీసాధ్వి॥ య॥

చ॥ స ని ద పా మ గా రీ స ని-స రి గ మ పా ద నీ స రీ
సకలమైనకష్టంబులు-జగమున గల్లనిందెలుగ
స ని స రి సా నీ ధ నీ ధ-ప మ పా దా ని స నీ రి ని॥ స॥
అకుటిల సత్యస్వభావు-లకె కల్పించును మర్విధి॥ య॥

క. రాము కఠినాజ్ఞ దెల్పగ। భామినిపరిపూర్ణగర్భవతి యేమగునో
నాముంగటమూర్ఛంబడి।యీమగువగొన్ను దురవస్థ నేనెటుగందున్.

గీ. గానరామాజ్ఞ పత్రింబుపై నివాసి
యీ పెచెంగటనుంచి నేనేగవలయు
నిదియె సమయంబటంచు సారధినిగూడి
సన్నసన్నగ సౌమిత్రి సాగెనంత.

సీ. ఉడుకెత్తి పాదులన్మడిగిన సీడలు చల్లగ దూపుఁనసాగుచుండె
వడదాకి తొరలినడగినపిట్టలు ముదముగ బైటను మోగుచుండె
కడు నెండవేడిమిన్గ్రాగినగాడ్పుహాయిగ మంచుకొండకై యేగుచుండె
కొండనుదిగి మేతకొరకు బెబ్బులు లుమ్మరిగ బల్లముల జెలరేగుచుండె

గీ. పాములకు బుట్టలోనుండి పడగ హెచ్చె
మడువు నెడబాసి యేనుంగు లడవిజొచ్చె
పొద్దు పడమటకు న్వాలి ముద్దువచ్చె
నెగడి జానకి వాలుకన్నుగవవిచ్చె.

గీ. అపుడు నిదురలేచి యాసీత సౌమిత్రి
ఎధముతోడ గానరాకయుంట
నద్భుతంబు భయము ననుమానముం దిగుల్
మించి యచట దల్లడించెనిట్లు.

కుంతలవరాళి-మిశ్రగతి.

ప॥ స మ పా ధ ని ధా స-న్ని ధ ప మా ద మా-స ని ధ ని ధా సా
మ సా నీ దా ప మ॥స॥

కలయో నిజమో ల-క్ష్మణుడు లేక యి-ట్లులడవిలో నుంటిగానే
నొంటిగ॥ స॥

అ॥ మ ప ద ని దా స నీ-ద ప మ స మ పా ధ ని-ధ స మ స ని ధ ప
మా ప ధ నీ ద సా ని ద॥స॥

పిలచినరాక ము-ద్దులమరదియేమయ్యె - దలపగ నరద మె-వ్వాల
మాయమయ్యెనొ॥ క॥

ఖి॥ ప మ స మా పా ద నీ ధ స నీ-దా పా మ పా ధ నీ దా సా
తెలియరాదిందు కేకతమో-దిక్కెవ్వరింక నాకయ్యో
మ ప ద ని ద సా ని ధ పా ధ మా-స మ సా మ పా మ దా మ
సా మ॥స॥
మువిధి వింతగ వ్రాసెనాత-లవ్రాత రామరామరామ॥క॥

శా॥ అన్నా లక్ష్మణ బుద్ధిశాలివిగదా యయ్యో యరణ్యంబులో
నన్నిట్లొంటిగనుంచి పోవదగునా నన్ దల్లిగాజూచె దీ
వెన్నండైన నకల్మషాత్ముడవు తండ్రీ రమ్మి నన్వేగ నీ
యన్నం జేర్చుము పల్కవేమయితివయ్యా వీర రామానుజా.

గీ. అనుచు బలుమారు సీత లక్ష్మణుని బిలిచి
యుత్తరము లేక వేడినిట్టూర్పుపుచ్చి
ధరణి నొక పత్రిముం జూచి దానిజదివి
కఠినరామాజ్ఞకు న్మూర్ఛగాంచె మరల.

సీ. ఎల్లపిల్లలుగూళ్ల కెక్కగ గుడ్లగూబలు ఋషిపక్షులుం బయలుడాసె
వైదేహిదురవస్థ పరికింపలేనట్లు ఖిన్నుడై సూర్యుండు కన్నుమూసె
పసపుగుంకుమము నాకసమునసంజయ న్వేరాసపెద్దమ యారబోసె
అంచెలుగా నక్కలరచుచు దెసలందు ధరణిజకష్టంబు నెరుకజేసె

చీకటిముసుంగునన్ భూమిచింతబండె
చుక్కలున్సీతకై మింట బొక్కుచుండె
బొదలిదవుదివ్వెలుగ గొండపొళ్లుమండె
జనకజకు నప్డు దష్టమశనియు నిండె.

క. జానకియు మూర్ఛదేరిన| పైనెంతయు వెఱిమెత్తి భయముదొరగి య
క్కానినమున దుర్భర శో|కానలదందహ్యమానయై యిట్లేడ్చెన్.

భవాని - రూపకము.

ప॥ స గ-ర స నీ గ రి ని ధా మా-నీ-ధా ని స రి గని ॥స॥ మ గ రి ని రి
ఎంత-పనిజేసితివి రామా-నీ-వింతకఠినుడవనియెఱుగ ॥నెం॥

అ॥ ధా ని సా రి సా ని ధా ని ధ-మా గ మ ధ ని సా గ రీ ని ॥స॥
సంతతంబు నిన్నె నమ్మి-సాధ్వినడవి కప్పగించి॥యెం॥

1. నీ స రీ గ మా గరీ స-ని ధ ని సా ని ధా ని ధా
నీచులాడుకొన్న నేమి - నిజము నీ వెరుంగవా
గా రి గ రి స నీ ధ మ ని ధ-మ ధ ని సా రి ని స గా రి॥ స॥
నాచరితపవిత్రమని యు-నలుగు సాక్ష్యమివ్వలేవ ॥యెం॥

సీ. అపవాదమూడ్చి రాజ్యంబున నీతినిల్పుటకు నన్విడనాడె భూమిభర్త
గాన ప్రాణేశుపై నేరము లేమి కలవార్త దెల్పక కన్నెరంగి
యడవిలోననుడించి యరిగిన సౌమిత్రితప్పిది రామాజ్ఞ జెప్పినంత
నిండుగర్భిణినగు నేడు దురవస్థ బరికింప లేకిట్లు పత్రిమందు
వ్రాసిపోయిన లక్ష్మణునివలన గీడు
నాకుదోచదుగాని యెన్నంగ దుష్ట
రావణాసురుచేత గొంపోవబడిన
నాడె చావక బ్రతుకుట నాదితప్పు.

హిందోళము - చతురశ్రగతి.

ప॥ సీ దా మా ధ ని నా మా గా-మ ధా ని స మ గా మ ద ని స॥ సీ॥
రమ్మా మృత్యువవే సం జే-సీమ్మా చచ్చి సుఖింతునిప్పుడు

అ॥ సమ్మ గా మ దా ని స మా గ మ ద ని-సా ని దా నీ ద మా గ సా మ
గ మ ॥సీ॥

నమ్ముకొన్న రాముడు నన్విడ చెను-నాకునీకన్న మిత్రులెవ్వరిక॥ ర॥

1. ద ని సా ని ద సీ దా మా-గా స మా గ మా దా ని స నీ ద మ
తినుడోపులులారా నే-దీనురాల మీా యాకలిదీరగ

స మ గ మ దా ని సా ని ధ మ గా స మ-గా మా ద నీ స మా
గా స మ గా
ఇనకులదీపమైన రఘురాముని- కిల్లాలనయ్యునిందంబడియూ
మ ద ని స మా గ స ని ధ ని స ని దా మ- గ స మ గా ధ మా
ని ధా స మ గ స మ॥ దీ॥
వనమున నొంటివిడువబడితినింక-బ్రతుకనొల్ల మీాకు బుణ్యమగునను॥ది॥

గీ. ఇటులవిలపింప జెంగటి యేటిలోన
సందెవార్చెడి వాల్మీకి చప్పున జని
యెంతయుం దయతోడ నా యింతిని గని
భయపడకుమని యిట్లనె నయముతోడ.

పరితాపవరాళి - ఖండగతి.

ప॥ సా రి మా ప స ధా ప-మ గ రి సా రి మ గా రి ॥సా॥
అమ్మనీవిటులేల - నడవి నొంటిగనుంటి ॥వ॥

అ॥ సా ధా ప మ ప సా ధ-రీ మ గ రి పా మ గ రి ॥సా॥
ఇమ్మాడ్కి-విలపింప - నేమికతమో తెలుపు ॥మ॥

మి॥ రీ మ ప సా ధా పా-మ గ రీ సా రీ మ ప
నమ్ముము నీకింకన్ - నళినాక్షీ మేలగు
మా గా రి స రి మ ప రి - స ధ పా మా గా రి ॥సా॥
జుమ్మా భయపడకుము - చూడు నేవాల్మీకి ॥న॥

క. అనిపల్కి ధృతిందెల్పిన । మునివరునింజూచి కేలు మోడ్చిమహాశో
కనినదమున రాల్గరుగన్ । జనకజయిట్లనియె నపుడు సవినయఫణితిన్.

కమలామనోహరి - ఖండగతి.

ప॥ గా మ పా ని స ని ధా పా-మా-గా స గ మ పా మ పా ని ॥గా॥
ఏమి చెప్పుదును తండ్రి - నా-నోము ఫలమింతేనుండి ॥యే॥

అ॥ సా ని దా పా మ గ స-గ మ ప నీ స ని ధ పా
రామునిల్లాల దశ-రథునికోడలనునే
మా గా స గ మ ప మ గ-సా ని సా గ మ పా ని ॥గా॥
సామంతుడగు జనక - చక్రివర్తికిబుత్రి ॥నే॥

చ॥ సా నీ ధ ప మా గ స-గా మ ప నీ స ని ధా।పా మ గ మా పా
ని ద పా నీ స ని ధ ప మ గ స ॥గా॥
ఆమూర్ఖుడు రావణు - డంటినమాత్రిననే । బామరనిందంబడీ -
పాణేశుడిచటవిడిచె ॥నే॥

1. పా మ గా మా గ సా-గా మ ప ని సా ని ధ ప
సీతనా పేరుసం-పూతననిసాధ్వని
మా గ సా గ మ పా మ-పా ని స ని ధా ప మ గ
పీతిహోతుడుపల్కు-రీతిమునుదావినియు
సా గా మ ప నీ ధా-ప మ గ మ గా. సా గా । మా పా నీ స ని
ధ ప-నీ ధా ప మా గా స ॥గా॥
ఈతీరుననాధుం-డిచటికిబోదోలేక । నీతో దెల్పుకొనెద- నేనిండుచూ
లాల ॥నే॥

గీ. అగ్నిసాక్షిగనేసాధ్వినౌటగనియు
నింతకాలము ననునాధుడేలికొనియు
నిందెసైరింపలేక నన్విడిచెగాన
జచ్చిబ్రతికెదనీవునీజాడబొమ్ము.

ఝూలవరాళి - రూపకము.

ప॥ ఎందుకీయాడజన్మ - మెత్తితినయ్యో ॥యెం॥

అ॥ మందభాగ్యురాల రాము - మన్ననయెటునిల్చునా ॥కెం॥

చ॥ కందర్పకోటిసుందరు-డుంద్రిజగదేకవీరుడు
సందిటగొనినాధుడున-న్నుందుదకడవిపాల్సేసె ॥నెం॥

1. ఇందుకా ననుగంటివోమ - హీ దేవినాతల్లి
యిందుకాసను జెంచితో మిథి-లేశ నాతండ్రి
యిందుకవ పుట్టినిల్లుపెరచి - యెలమినిస్సు బెండ్లిగూడి
యిందుకనాయకుము లెడపె - వేలితివిన్నా ళ్ళు రామ ॥యెం॥

క. పొరిబొరినేడ్చుచునేల౯ । బొరలుచుగర్భవతియగుటనొగిలుచు నెగ యూ పిరి దీయుసీత మేనుని।మరిపప్పిన్నేద దేర్చి మౌని యిటులనె౯॥

గౌడమల్లారు - త్ర్యస్రగతి.

ప॥ సా రి మా ప ధా స నీ ధ - మా గ రీ సా రి స ని ధ ॥సా॥
అమ్మతండ్రినంటివాడ - రమ్మునాయింటికిప్పుడు ॥స॥
అ॥ మా ప ధ స రి మా గా రి స - నీ ధ మ గ రి మా గ రీ ॥సా॥
నమ్మదమున నీనాధుని - సమ్ముఖమున జేర్తు౯ ని ॥న్న॥
చ॥ రీ మ ప ధ మ పా ధ సా ని - ధా రి మా గ రీ స నీ ధ
నమ్ముమటుల జేయకున్న - నన్ను మాను శకబిల్వ
సా రీ మ ప ధా మ గా రి స ని ధ పా ప స సా ని ధ రి॥సా॥
కొమ్మా వినుచెప్పు నీకు-కొడుకులిద్దరు పుట్టగల ॥ర॥
1. ధ స రి మా గ రీ మ పా ద - సా ని ధ మా ప ధ మా గా
జనకపుత్రివైన నేమి - సత్యపరాక్రముడౌరా
రి స రి మా గ రీ స నీ ద - సా ని ధా మ ప ధ సా ని ధ॥
మునికిభార్యవైన నేమి-పూర్వకర్మమెట్టు దప్పును
ని ధ పా మా గ రి నా రి మ-పా ధా సా రి మ గా రీ
జనుమా మా మునిపల్లెకు-సందేహింపగి నేలా
స ని ధ రీ స నీ ధ మా ప-ధ మ గ రి సా ని ధ సా ని ద ॥సా॥
వినుము నీదుభర్త౯ నిను-బిలుచు నుపాయము పన్నెద॥ స॥

గీ. ఇటులబుజ్జగించి ఋషిపల్లెయందాపె । గోరసట్లు మారుపేరు బెట్టి స్వీయ గృహమునందుసీతనుగాపాడు।డనుచుమౌనిసతులకప్పగించె.

ద్వి॥ అంతట ఖేద మోదాశ్చర్యములను
కాంతలు గుంపులు గట్టి ధైర్యంబు

2. జానకికిం జెప్పి సదుపాయముగను
స్నానభోజన పరిచర్యలుసలిపి

3. అక్కరో చెల్లెలా యనుచువావులను
మక్కువతో బన్ని మన్నించిబిలిచి

4. మచ్చికగావించి మంచిసామ్యాములు
ముచ్చటలంజెప్పి మొనసి నవ్వించి

5. నెమ్మదిమరపించి నేరుపుతోడ
గమ్మని పూలపక్కను నిద్రపుచ్చి

6. వెంటవెంటనె లేచి వేళలుజూచి
కంటికిరెప్పల్లు గాచుచునుండ.

సీ. ఎప్పటికిం దొల్కరించునోయని వానకోయిలతీయనికూత వేసె
చీకటివలెనింక సీతకు నపవాదవీడునంచున్ మలికోడిగూసె
వగనగాజుక్కలు మరిచందురుందుదివ్వెలు గల్వలుం దమ వెలుగుబాసె
వై దేహిహాయిగ బ్రసవించుశకునమ్ము కొమ్మకెగరికాకిగుత్తుకజేసె
విచ్చుతమ్ముల దుమ్మెదల్వేడ్క మ్రోసె
దుర్లిజక్కవకవలు కౌగళ్ళడాసె
దెమ్మెరల్చల్లకపరింబు దెసలరాసె
బొద్దుజేగురురంగు తూర్పునకుబూసె.

క. జానకియు గర్భవేదన। తో నంతట లేచి మిగుల దొట్రిల్లెడు న
మ్మానినితులదాపున నెంతో నొప్పలుబడుచునిట్లుతొట్రిలుచుండెన్.

నాగస్వరావళి - తిశ్రగతి.

ప॥ గా మ పా ధ సా ధ ప మా-గా మ పా ధ మా॥గా॥
త్రాళలేను నొప్పులకో - తల్లులార నే॥ దా॥

అ॥ పా మ ప ధ స ధా ప మా గ-స గ మ పా ద సా।
నేలబ్రతికినాను నాథు-నెడసి యిట్టులక।

ఉపపల్లవి॥ దా పా మ గా స గ మ-పా ధా స ధా
పాలించరా చలము-చాలించురా।

సా గా మ పా మా గ - మా గా స మా॥ గా॥
ప్రాణేశ రామా మొ-రాలించురా॥ తా॥

1. సా గా మా ప ధ స ధా ప-మా గసా గా మ పా।
పుట్టిల్ల త్తయిలు బాసియిట్టు లేనుంటినా।
దా ప మ పా ధా సా ధ ప-మా గ సా గ మా ప ధా।
నిట్టడవిన్ని ళ్ళాడగ-నేనునోచుకొంటినా।
సా దా పా మ గ సా-గా ధ స గా మా-పా మ పా ధ సా ధ ప
మ గ-సా గ మ పా మా,
కట్టా రామానంజే-పట్టుర రామా కట్టుకొన్న దానివిడువకర్జమ రామా॥

సీ. అబ్బబ్బయీనొప్పులధికమాచున్నవి యింకెట్టులోర్తు నోయింతులార
ఆడపుట్టుకకన్న నడవిలో చెట్టయి పుట్టుట మేలగు పొలతులార
నా వార్తవదినెకు నాయత్తకమ్మకయ్యకు దెల్పి తోడితెం డతివలార
యింక నే బ్రతుకబోనిదినిశ్చయమునాథునగుపర్చుడొక్కమారమ్మలార

తండ్రిజనకుడ కావుమో తల్లిభూమి
యిప్పటికినైన నాజీవమేలపోదు
యక్కటా లక్ష్మణా యొక్కరైన బలుక
రేమి సేయుదు నోరామ రామ రామ॥

క॥ నొప్పులిటుల మిక్కిలి పడి
యప్పుడు బాలారుణోదయావసరమునఁ
గొప్ప శుభముహూర్తంబున
జప్పునఁ నీళ్ళాడె జనకజాత ముదముగాఁ.

జనరంజని—త్రిపుట.

ప॥ స రి గ మా ప ద పా ని సా ధ ప-మ రి స రీ గ మ పా మరీసరి ॥స॥
కవలుఫుట్టిరి చిన్నిరాముల-కరణిముద్దులుమూటగట్టుచు॥గ॥

అ॥ ద ప మ రీ గ మ పా ధ పా ని స - రీ స ద ప మ రిగమపధాపని॥స॥
రవికులంబభివృద్ధిగాంచను-రాగమునమునిసతులు చూడగ॥గ॥

మి॥ ధ ప మ రి సా రి గ మా ప ధ-పా-ని స రీ గా మ రి స ద పా ని స।
పవనుడు చల్లగ మెలగ-పి-వగ బద్మంబులు వికసిల్లగ
రిగమా ప ద ప ని స ధ ప మ-స-రీ గ మ పా ధ ప నీ స రి స ధ ప నీ॥
స॥
నవనీరదశకలములన-జిరు-నవ్వున జానకిఖేదమును మరువగ॥

గీ. అప్పుడు వాల్మీకమౌని యాయర్భకులకు
జాతకర్మంబు సేయించి సంతసమున
బాలకుశలవాస్తరణ నుద్భవిలుకతన
గుశలవులనుచు బేరులకుఁ గ్రిలకిడె.

క. కేవల సత్యస్వాంతా
ధీవిపులబలార్కవిజితదితిజధ్వాంతా
భావితసీతాకాంతా
సేవకజనవనవసంత శ్రీహనుమంతా.

మాలిని॥ సకలనిగమవేదీ సాధుగానప్రమోదీ
ప్రకటిత ఋజువర్త్మా రామపాదార్పితాత్మా
ముకుళితఖలకామా భూరిలంకేశభీమా
అకుటిలజనగేహా యారవీరాంజనేయా.

గీ. అవధరింపు మయోధ్యలో నప్పుడు లక్ష్మ
ణాగ్రజుడు జానకీవిరహానలమున
దూలు చొంటిగ నొకపూవుదోటకేగి
యెంతయుందనలోఁ బలవించెనిట్లు.

గవాంభోధి-త్రిశ్రగతి.

ప॥ సా రీ గా రీ స నీ-సా-రీ. గ మా ప మ గ రి॥ సా॥
అయ్యోజీవేశ్వరీ-యిం-తయ్యేనామనబ్రతు॥ కి॥

అ॥ పా మ పా ధా ప మా-పా మా గ రీ సా నీ॥ సా॥
ఎయ్యెడనుంటివో-ఏమనుకుంటివో॥ య॥

1. ప ధ ని స రి స గా రి స నీ-దా ప మ గా రీ గ మా
అరయగమనశోకము జ-న్మావధిగా జేసెనా
ప ని ధ పా ద నీ స రి గ రి-సా ని ధా పా మ గా రి॥ సా॥
పరమపావనీ మనకీటు - వ్రాసెనా కొయ్యెదయ్యోమయ్యో॥

2. సా ని సా రి గ రి సా ని-దా ప మ ప ద ని స రి గా
నిండుగర్భిణివినిన్ను-నేను విడువవలసెనా
మా ప మ గ రి గా రి సా ని- స రి గ మ ప ధ ని స రి ని॥ సా॥
వెండియుమనయాసలెల్ల-బెరిగిపడటగలసెనా॥ యు॥

సీ॥ హరువిల్లువిరచి నా యురమునపూదండ నెగ్గించునప్పుడునున్నిగ్గుగొల్పు
పిత్రాజ్ఞనడపకై వెడలెడునావెంట నేతెంచునపుడు సంతుష్టినిల్పు
బంగరులేడికై బ్రమసి చనునృప నక్కబుత్తెంచుతరి వింతముద్దువెల్పు
దశకంఠుడీల్గిన తరువాత నగ్నిసాక్ష్యమ్ముగ వరసతీత్వమ్ము దెల్పు
నవరసమ్ములకాపు మన్మథునితూపు
మిట్టమీలనురేపు క్రొమ్మించుదాపు .
నిర్మలవినీతికిం బ్రాపు నెనరుజేపు
నట్టి నీచూపుగన కెద యెట్టులోపు॥

ఉ॥ ఎంచగభాస్కరాన్వయుఁడు నేచెడుదుర్వ్యశమగ్రహంబు శాం
తించగ నిన్నరణ్యమునకే బలియిచ్చితిగాని నన్ను బా
ధించెడు నీవియోగమను తెంపరి దయ్యమొహో మృగాక్షి హా
మ్మంచును నాదుప్రాణ ముపహారముబొంద కెటుల్లమించునే॥

కౌమోదరాగము-ఖండగతి.

ప॥ సా ని మ గ రీ స నీ-సా రీ గ మా సి స ని॥ సా॥
నిండెయను చీకటికి-నీ వేను జక్కవల
రీ స ని మ గ. రి స ని రి-సానిమా గ రి స నీ॥ సా॥
చందమున విరహమున-గుందుచుంటిమి సఖీ॥ నిం॥

అ॥ మా నీ మ గా మా గ-రీ-గా రి సా రీ స
ఎందాకసైరింతు-మీ ఘోరశోకంబు
రీ గ మా ని స ని రి ని-రీ గ మా ని మ గా రి॥ సా॥
కందెదుంగని నెల గంబుగల్గినదాన

మి॥ సా రీ గ మ గ రి నీ - మా గా రి స నీ రి
డెందంబినుముగనే - నిందుంటినిగానీ
గా మా ని స రి ని మ గ - రీ గ రి గ మ ని స రీ ॥సా॥
యందీవెటుబ్రతికెద. - వాసదొరగి యకటా ॥నిం॥

మా ప దా ప మ గ రి గా మా ప మా - గా రి సా ని స రి గ
మ ప మ గా రి స ॥నీ॥
నీయుదారమహిమగన్పర్చుచూ - నీవు నేనుమరలగలసియుండవు॥హా॥

మ. అయయోపల్కవదేమి కోపమదురన్యాయంబుగా బారులెం
తయుమద్వంశము నీకతంబునను నిందన్సేయుటంబట్టి స
న్నయధర్మంబులుతప్పకుండ జనులన్శాసింపగాగోరినిర్
భయదారణ్యమునందు బోవిడచి యిబ్భంగిన్విలాపించెదర్.

గీ. అనుచు వేడునతనికనులముంగటనీత । మాయమయ్యె మరియుమహిమతో నె
లుంగుచుండినశివలింగమంతటజూచి ప్రణతుడగుచురాముడునుతి సేసె.

శూలిని - రూపకము.

ప॥ ప మ గ మ ప ధ నీ స రీ స - రి స ని ధ ప మ గా మా ప॥
జయజయకరుణాంతరంగ - జయజయశివలింగా ॥జ॥

అ॥ గ మ గ రి గా మ గ రి సా ని - స రి గ మ ప మ ప పా ప॥
జయజయకామమదభంగ - జయజయధవళాంగా॥ జ॥

మి॥ ని స రి స ని రి స ని దా పా - మ గ మ ప ధ ని స రి రి సా
జయజయజలధినిషంగా । జయజయవిస్తృతకురంగా
ని రి ని స రి గ మ ప ధా నీ - స ని రి నీ ధ పా మ గా మ ప॥
జయ భవతిమిరపతంగా - జయ యుమాహృదబ్జభృంగా ॥జయ॥

1. సా నీ ధ ప మ గ రీ స ని - సా రి గ మా ప ద నీ స ని - సా రీ
స ని ధ ప మా గ రి - సా రీ గ మ ప ధ పా మ గ
సృష్టిస్థితిలయకారణ - సేవకకష్టనివారణ - దుష్ట త్రిపురసంహారణ -
నగజాహృదయవిహారణ

మా గ మ పా ధ ని సా రీ - సా ని దా ప మ గా రీ స
నష్టసమస్తవిమోహా - నాగచర్మలసద్దేహా
రీ గ మ ప ధ నీ సా రీ - సా నీ ధ ప ధా పా మా॥ ప॥
పుష్టవృషభరాడ్వాహా - భూతప్రియోత్సాహా॥ జయ॥

ఉ॥ పారములేని సంసరణవార్నిధిమున్గి రజస్తమోగ్రహా
క్రాంతనితాంత బాధలను గుందుచు దుర్విధిచేత జీవనా
ధారముగాజరించు నిజదార నరణ్యముపాలుసేయు బ
ల్దారుణకర్మ సత్కులకళంకుననుం దరిజేర్చు శంకరా.

సీ॥ అపుడు శ్రీరాముని కాలింగమందున వినబడెనిట్టులవిశదముగను
రాముడా నమ్మము నీమనోభ్రమ జగమంతయుగాని సత్యమ్ముకాదు
సత్యమానందము నిర్గుణమగునాత్మతత్త్వమీవిశ్వంబుదనమహిమను
పుట్టించిపోషించి పొలయించినట్టుల నాటాడు నిదిరహస్యంబుజుమ్ము
తోడరి నీనీడజూచి నీవడదనేల। నీవె యీ లోకమంతయు నీకుదప్ప
వేరువస్తువు లేదని విశ్వసించి।సర్వమోహంబులందుడ్రించి శాంతిబొందు॥

గీ. నీకునిశ్చలతత్త్వంబు నెగడువరకు । గురుతుతోడుతమద్బోధమరువబోకి
తోడరియీలోకధర్మంబునడుపుచుండు। మేలవేమాటలేనెనీనింతనిజము.

చ. ఇటు కలగాంచి మేలుకొని యెంతయు నద్భుతమంది రాము డం
తట దనకున్న మోహము విదల్చిన యప్పరమాత్మతత్త్వముల్
స్ఫుటముగ జ్ఞప్తి తెచ్చుకొని చోద్యముగా జిరునవ్వునవ్వి ది
క్తటములు మ్రోయ నీశ్వరుని దన్మయతన్వినుతించెనిట్టులన్.

రఘుప్రియ - ఖండగతి

ప॥ మా పా దా ప మ గ - రీ స ని స రి గ మ ప ద - ని స రీ గ
మా పా మ గా - మ ధా నీ ధ పా॥ మా॥

ఈవే నేననుచు నిజ్జగము భ్రమయనుచు - నెరింగించి తేశంకరా - యి కే
శంకరా॥ యీ॥

అ॥ దా పా మ పా ధ ని స - రీ సా ని సా రీ గ। మా పా మ గా రి
స ని ధా ని సా నీ స రి గ
నాపంతమాన్పుటకు - నాకిట్టులద్వైత। భావంబుదెల్పితివ - కేవలా
నందమయ॥ నీ॥

చ॥ మా పా ధ నీ స ని ధ - నీ రీ స రీ గా రి। సా నీ ధ పా మ గ రి
గా మా ప ధా పా॥ మా॥
నీవేనిజంబుమరి - నేనేయబద్ధంబ। హావిశ్వమంతయు న-హంకార
జన్యం॥ బీ॥

గీ. ఇట్లురఘురాముడుం బరమేశువలన
దనరునిర్గుణాద్వైతాత్మతత్వమెరిగి
స్వీయధర్మంబుతోడ నిశ్చింతనుండ
నుర్విజయు గల వనములో నొక్కనాడు.

సీ. పడమటవిశ్రాంతిబడురవి తనసిరినుదితుడౌచందురునకొప్పగించె
జానకిసత్కీర్తి భూనభోంతరములనిండినయట్లు వెన్నెలలుగాచె
సెగమందమైపగల్పి గురుగిప్పియడంగుపాంథులవిరహంబు ప్రజ్వరిల్లె
సహజగానకవిత్వశాలిదరీశుష్కశాస్త్రజ్ఞులై జుక్కసారువూసె
అందముగనట్లుపున్నమసందెమీర।జానకియునేకతంబున ప్రాణవిభుని
చెంతదానుండకుంటకుజింతబొంది యొడదనీరయిగుట్టులనడలజొచ్చె॥

సాలగము—రూపకము.

ప॥ సా రి గ మా పా దా నీ-సా నీ ద ప మా గ రి నీ ॥సా॥
కోమలమేఘశ్యామా-రామాయెటుతాళుదురా ॥కో॥

అ॥ పా మ ప ద ప మా గా మ గ-రి స నీ స రి గ రి సా రి ని ॥సా॥
నామియిపుడునీచెంగట-జరియింపగ మనసాయెర ॥కో॥

చ॥ గా మ ప దా ప ని దా ప మ-పా ద ని స రీ స గా రీ।
ఈమధురంబగువెన్నెల-యీ మలయమారుతంబుల

సా నీ సా రీ గ రీ స-ని ధ ప మ గా మ గా రీ ని ॥సా॥
సామీనీతోడనున్న-సఫలమగునుగదానాకు. ॥గో॥

1. దా ప మ ప ద ని స రీ గ రి-గా రి స నీ సా రి గా రి
ఎన్నడునినుగనుగొందు మ-రెన్నడు నీప్రేమగందు
సా ని ధ పా మ ప ధా ప మ-పా ధ నీ ధ ప మ గ రీ స।
నెన్నడు మోహముదీరగ-నీవు నేనుగలిసియుందు

మి॥ నీ స రి గా మ పా మ గా-మా ప ద నీ స రి గా రి।
నెన్నడునీగభీర వా-క్కింపుగవీనులవిందు
సా నీ దా నీ ద ప మా-పా గ మా రి సా ధ రీ గ ॥సా॥
నిన్నాళ్ళిట్లుండెనునా-దెంత మొండిజీవుడందు ॥గో॥

సీ॥ ఘోరనేమాత్రమెయాలించునటువు స్త్రైముడిముడికింబెట్టు ముద్దునేపుఁ
తొలుత న న్మరిపించిపలికించి మైను వ్వోసరసంబుజేసినజాణతనము
అలదండ శాటవియందూబి కాల్వల తెన్నున నన్నెత్తుకొన్నకుాము
వామాంకమునునుంచి పట్టాభి షేకంబునందునాకుం జేసినట్టిగొప్ప
ఏను నెలతప్పినప్డుపిత్ర్యాణమింక । దీచఁ గలనంచునీవుబొందినముదంబు
నెంతకనితలపోయుదు నెట్టులోతుఁ । నోముఫలమిట్టులుండెనా రామ
రామ॥

భోగివసంతకము——రూపకము.

ప॥ సా ని దా మ గా రి గా మ-దా మ గా రి సా రి నీ ॥సా॥
రాముబాసియుంటినెంత-రాతిగుండెదాననో ॥రా॥

అ॥ సా రి గ మా ధ ని సా నీ-రీ ని ధా మ ద మ గ దా ని ॥సా॥
ఈ మునివాటికలోనే-నేలనిట్లుబ్రతుకగంటి ॥రా॥

మి॥ గా ద మ గా రీ స రి స ని-సా రి గ మ ద నీ స నీ ద
ఏమియుబాపంబెరుగని-యింతనిరపరాధురాల
మా ధ మ గా రి గ రి స రి ని-సారిగ మా ధ మ గ మ ధ ని॥ నా॥
నామగడేలననువిడచె-పేర్మిమెుకింతయుదలపక ॥ రా॥

1. రి స ని దా ని దా మ గా మ-ద ని స రి గా మా గ రి స
జనకజాతనైననేమి-సకలజగద్వీరుడైన
రి స రి గా మ ధా మ గా రి-సా ని దా మ గా మ దా ని
యినకులాబ్ధిచంద్రురాము-నేనుగట్టుకొన్ననేమి
స రి గ రి గా మ ద నీ సా-రి స నీ దా మ గ రీ గా
అనలముసాక్షిగనాపా-వనతంజూపిననేమీ
మ దా మ నీ గ రి సా నీ-స నీ ధ మ గా ధ మా ధ ని ॥ నా॥
శాపవాదముపాల్సే-సినన్నిటులుంచెదువిధి ॥ రా॥

సీ॥ నాధునితోడనన్గలిపెదనని మాని గట్టిగనాకాసబెట్టినాడు
గానియిప్పటికైనగరుణించకుంట కేహేతువో నాదుర్దృష్టమేమొ
అంతవానికిబుట్టినట్టినాబిడ్డలు మధుకరవృత్తిఁగోమనగవలసె
సంపూర్ణభావుడౌజనకునికీవార్త యెటుసిగ్గుమాలిప్రకటించువాన

రాము నికజూడకున్ననేబ్రతుకలేను
చంటికూనలనెడబాసిచావలేను
అక్కటాద్వంద్వసంకటమయ్యెనాకు
నెద్దియుందోచకుండె నేనేమి సేతు.

క॥ అనికన్నీర్వంచెడి తల్లినిగన్గొని కుశలవుల్గడింది కనికరం
బున వింతయుసందియమును బెనయగ నిట్లనిరిదిగులుమిగిలినమదులన్.

ధాతువర్ధని - త్రిపుట.

ప॥ సా ని ధా ప మ గా మా పా ధ ని-రీ స రీ గ మ పా ధ నీ రీ ॥సా॥
ఏలనేమాయమ్మానీవిటు-లేడ్చుచుంటివిపల్కు-మాతో ॥నే॥

అ॥ గా మ ప మ గా రీ స నీ ధ ని-సా ని రీ గ మ గా రి సా రి ని ॥సా॥
చాలునికగన్నీరునించకు-చాలుమాకునుశోకమయ్యెడు ॥నే॥

చి॥ పా మ గ మా ప దా ని సా రి స-నీ స రీ గ మా పా మ గ రీ
మేలుగజాలినంతభిక్షము-మేమునేడు తే లేదని యో
సా రి స నీ స రి గ మ ప మ గా-రీ స నీ ధ పా మా గ మ స ధ
నీ రి ॥సా॥
మేలిమిలేకనినుమునలివా-ల్మీకితాత యేమైనగసరినా డా ॥యే॥

1. స ని ధ పా మా గ రి గ మ ప ద ని-సా రీ స నీ దా ప మ్మా
మరియునీవేడ్చినను నిజముగ-మాతోడునుమ్మా యమ్మా
స రి గ మా పా ధ ని స రీ స ని-స నీ దా మ ప మా గ రీ స ని
సరిగమాప్రశ్నములకిప్పుడు-సమాధానముమాకు దెల్పుమ
రి స ని ద మా పా ధ నీ సా-రీ గ మా గ రి స నీ ధ ప మ గ
పరువుగమమ్మొక్కరైనర-బ్రిహ్మణాధ్రముననైపిలువరు
రి స రి గ మా నీ ద మ ప ద-నీ సా ని ధ పా మ గ రీ స ని ॥సా॥
గురుతుగమాకుందండ్రియుగుల-గోత్రింబులు లేవనిజెప్పెద ॥రే॥

గీ॥ ఇట్టులడిగెడుబాలురకింతియొద్ది।యైన ననలేక వాల్మీకమానిదరికి
జేరి కొనగోటవాల్గంటనీరుదెసల।జిమ్ముకొనుచు డగ్గుత్తికంజెప్పెనిట్లు.

పావని—మిశ్రగతి.

ప॥ రీ సా నీ దా పా మ గా రి-సా-నీ సా రీ గా మా ప ధా నీ ॥రీ॥
ఎన్నాళ్ళుపై రింతుదండ్రి-నే-నీశోకాగ్నింబ్రోర్చుచుండి ॥యె॥

అ॥ పా మా పా దా నీ సా-నీ గా రి స ని దా ప । మా పా మ గ రి
సా ని-ద ప మా ప దా ని సా॥
పన్నెండేండ్లాయె నా-ప్రాణేశునెడబాసి కన్నారనిక నాథు-గననోమ
నైతినా॥ యె॥

మి॥ దా ప మా గా రి స ని స గ రీ-గా మ పా ధ నీ స రి సా నీ॥
నన్నుగన్నబర్చ్చమనియెదరీ-చిన్నికూనలుం దమయయ్యన్ ।

గా రి సా ని స రీ గ మ ప ద ని-సా నీ ధా ప మా గా రి సా ని।రీ
ఉన్నగోత్రము చెప్పుమనెదర-యోయెట్లుత్తరంబిచ్చుదాన॥ నె॥

1. మా ప మా గ మా ప దా పా-దానీ-రీ స నీ ధ ప మా గ రీ సా।
బాస జేసినావు కావా-నన్నా-ప్రాణనాధుని గల్పరావా।

నీ స రీ గ మ ప మ పా దా-నీ-సా ని దా ప మా గా మా గా।
గాసిబెట్టకు మునిమిన్నా-నీ-కన్న నాకేదిక్కోయన్నా।

రీ స నీ ద-పమ-గా మ ప ద ని సా ని । సా నీదా ప మ పా ధా-ప
మ గ మా ప దా ని॥
ఆసబట్టి-యును-రాగెనింతకునాకు । గాసింతైనమనసు-గరుగదేమి నీకు।

సా రి గా రీ స ని స రి గ రీ-గా ప మ దా ప దా నీ స ని।
వాసిమీరంగ గుశలవులన్-బంపుమా నాదుపుట్టింటికి।

గా రి స నీ స రి గ మా ప దా-ని స రి స ని ధ ప మాగరిసరిని॥రీ॥
నేసదుపాయమునైన నే-నిపుడెసుఖముగజచ్చి బ్రతికెద॥ నె॥

ద్వి॥ అనియేడ్చుసీతతో నర్భకుల్గూడ-ఘనరోదనము సేయగావిని మౌని।
2 తానుగూడంగంటతడివెట్టిధైర్య।మానుచుదుదకెట్టులనియెనాయమకు।
3 ఓయమ్మశోకంబునుడుగుము నీవు।నీయాత్మజులతోడ నేనునయోధ్య।
4 కరిగి యుపాయంబునరసిరాముండు। తిరిగి నిన్ బిల్పించు తెన్నుబన్నెదను।

5 సైరించియుండుము సంయమీంద్రులకు । నారయగా నసాధ్యం బెందు గలదు।

6 అనుచు బాలురఁగొనియమ్మునియేగె।గొనకొని మంచిశకునములు రేగె।

క॥ శ్రుతిపంజరంపుచిల్కా।సతత శ్రీ రామనామసాధనశుల్కా-
తతలంకానగరోల్కా।గతలౌకికదుష్టకల్కకరువలిమొల్కా॥

మంగళమహాశ్రీ

పండనుచు భాస్కరుని-బట్టుటకు లేబురిటి-పాపడవుగా నెగిరినావా।
పండువుగ సీతకు శు-భంబులను దెల్పిసుర-వైరిపురికగ్గియిడిరావా।
కొండలకు రోమముల-కున్నమలు వైచుకొని-గొప్పకడలిన్విసరబోవా।
మెండుగను రామునకు-మేల్సలిపికీర్తిగొను-మేటిహనుమంతుడవు నీవా॥

వ॥ దేవా! యవధరింపు మిట్టు కేలకు వాల్మీకుండు ప్రభాతంబున నయోధ్యా సమీపంబు జేరి కాలోచిత కృత్యంబులం దీర్చుకొని తమయమ్మమాటఁగట్టియిచ్చినచల్దిభుజించి నేడ దేరినకుశలవులంజూచి యన్నలారా మీరు కన్నెరులుసరిగ శ్రుతిజేసికొని నే జెప్పిన రామాయణంబు సార్థకంబుగ విస్తారంబున బత్తివీథియందు దాహశాంతికై యావుపాలుమాత్రమడిగి గోరులుచుం బౌరులవీనులకు విందొనర్చి సంజప్రొద్దున నిటకు మళ్లిరండని యాజ్ఞయిచ్చినవ్వాల్లెయని యబ్బాలకులు తుమ్మెద రొదలమాడ్కి దంత్రీనాదంబులు మనంబుల హెచ్చరింప గోయిలలు మ్రోగినట్లు-నెమళ్లుగూయుభంగి-నొట్లువెలుగరణి- తారాజువ్వలెగయులాగున-డింకీ పావురంపుమొగ్గలతీరున- మేల్పటాసామొనర్చినగతి-జక్రంబులు దిరుగుచాడ్పున-పిగ్గూపోసీల ఖదముపలె-నరబ్బీ గుర్రంబులను డాంబాజీపసందున నేపాళపుబుంగలూదునట్లు-నీటిపై విసరునప్డు చిల్లపెంకు లెగురుగమనిక-సన్నజాజులు జల్లు తెరంగున-గపురంపుటనటిపండ్లొలచుభంగి- మలయమారుతము వీచు సొబగున-గొండప్రక్కల మాటిమాటికి హెచ్చుతగ్గులంబొర్లి పడిసుడిగొని రేగుసెలయేటి కెరటంబులవిధంబున - బూలచెండ్లాడుబాలపున-గవ్వలు గిలకరించురీతి - దేనియలూరు తెన్నునన్ జిత్తజల్లుబాగున-బన్నిరొలకు

పోల్కి - పండువెన్నెలగాచుపోడిమి-నమృతసారంబుగరిమ నిరుపమానం దంబుగ బల్కు రాగభేదంబులం దిర్దాయి గాత్రమమూర్ఛన లొప్ప— బెక్కు తాళంబుల దశప్రాణంబు లేర్పడం బ్రస్ఫుటచ్ఛందో వ్యాకరణా ర్థంబుల నవరసంబు లుట్టిపడ వాడవాడల శ్రీరామ చరితంబు బాడుచు నుండ గొంతవడి నిశ్చేష్టులగువారును—దత్తాళానుసారంబుగనానంద పరవశులై గంతులిడువారును - మూకమూకలుగ వెంబడించువారును - జూపులు దిప్పజాల కచ్చెరువడి చూచువారును - మనుజమాత్రుల కీ దివ్యశారీరంబులెట్లుండుననువారును సంగీతసాహిత్యంబు లొకదానికొకటి మీరి యపూర్వంబులై జగదేకమోహనంబులై యున్న విప్పసికూనల కెట్లు లభించెననువారును-భళిభళీ యాశ్చర్య మాశ్చర్యము నయస్సుతప్ప రూపురేఖలన్ శ్రీరామునకున్వీరికిన్వంతయు భేదము లేదిదేమాయయో యనువారును-లోకాపవాద మోర్వక విభుండు నిండుగర్భిణియగు జానకి నడవిపాల్సేయించెను గానియాపెయొట్లో దైవవశంబున బ్రతికినిస్సందే హంబుగనిప్పిల్లలంగాంచెననువారును - మొదలగు పౌరులద్భుతామోద సంశయంబులు ముప్పిరిగొనవెనురాగ నబ్బాలురు-కోటతడవునకు గోట గుమ్మముజేరి గానమోహితులై మత్తుమందు జల్లినట్లు మైమరచియున్న ద్వారపాలకుల నిరాటంకముగ గడచిరాజసభకు సమీపించి క్రమంబుగ రవదుర్లిఖిన మధురకంఠనాదంబు లేకమై సర్వప్రాణుల నొక్కమొగి నానందమూర్ఛన్ముంచిన నొకంతటికి రాముడత్యద్భుతంబున నబ్బాలకుల కెదురేగి యుచితాసనంబులం గూర్చుండబెట్టి వారల కిట్లనియె.

రసికప్రియ - రూపకము.

ప॥ దా పా మా గా రి స ని ధ - ని స రీ స ని ధా ప మా గ ॥దా॥
ఏయూరెవ్వారి తనయు - లెరిగింపుడు బాలురార ॥యే॥

అ॥ మా పా మ గ రీ సా రి గ - మ ప ధ పా మ ప ధ ని సా ని ॥దా॥
మీయాకృతి మీగానము - మిగులనద్భుతముగ నున్న ॥వే॥

మీ॥ గా మ ప ధ ప మ ప దా ని స - రీ గా మ ప ధా ని సా ని
ఏయధిపుని చరితంబిది - యెవ్వాడు రచించెనీని

రీ స రీ గ మ ప మా ధ ని - సా ని ధా ప మా గ మా ప ॥దా॥
హాయిహాయి మిముగాంచిన - యమ్మయెంత ధన్యురాలో ॥వే॥

1 ప మ ప దా మ గా రి సా ని - సా రి గా మ ప మ దా ప మ
మముదరింపజేయనిట్లు - మారువేసమున వచ్చిన

ప ద ని స రీ స ని సా ని ద - ని రి నీ ధా నీ స నీ ద
యమితదయాంబుధులౌహరి-హరులో మీరన్నలార

ని స రీ గా మా పా ధ ప - ధా ని సా ని రీ స నీ రి
అమర స్వర్లోకంబుల - నైన నేల్లజాలుమీాకు

స ని ధ ప మ గ రీ స నీ స-రీ నీ గ రి సా ని దా ప ॥దా॥
క్రిమమెరుగని బ్రహ్మ కావి - కౌపీనము లేలగట్టె ॥నే॥

క. అనుచాశ్చర్యమునన్మున్గిన రామునికిట్టులనిరి కేల్మోడ్పులతో
వినయముమీరగ కుశలవు,లనూన వాఙ్మధురవృత్తికందరుపొగడన్.

విశ్వంభరి - ఖండగతి.

ప॥ స రి గా మ పా మా గ-మ ప దా ప మ గ రి స ని - ధ ని స ని
దా ప మ గ రి - సా రి నీ సా రి గ రి ॥స॥
వినుమయ్య మాయూరుమునిపల్లెయిచటికొక-దినము ప్రయాణము
వల-దిక్కునందున్నయది ॥వి॥

అ॥ ప మ ప ధ ప మ ప గా మ - ప మ గ రీ సా రి స ని - స రి గ మ
ప ధా ని స ని - రి స ని దా ప మ గా రి ॥స॥
జనకునెరుగముగాని-జననివాకుంగలదు-సౌనగ మముబెంచునొక-ము
సలిగడ్డముతాత ॥వి॥

మి॥ స రి గ మా ప ధా పా - సా ని రి నీ ధ మ గా - మ ప దా నీ సా
రి ని - గ రి. ని. ధ ప గ రి స ధ ని ॥స॥

మునురచించి నేపెట-న్మ్రష్టికుపాయముగా।ఘనుఁడౌ శ్రీరాముని-కథ
యటయిది నిజముగ ॥వి॥

గీ॥ అనుచు ముద్దులొల్కు నయ్యభకోలను నం।తఃపురంబులోని తల్లులు మొద
లతివలకును జూపియధిపుడద్భుతమున । బొడుమనగవారు పాడిరిట్లు.

వరుణప్రియ - రూపకము

ప॥ గా మ పా ధా ప మా-గా రి సా ని సా గ రీ॥ గా॥
ఇంక జాగేలనే-యింతి సైపజాలనే॥ యి॥

అ॥ నీ స రీ గ మా ప మా గ-ధా ప మ గా రీ ని సా॥ గా॥
పంకజాక్షి నీదు మోవి-పానకమీరాదటే॥ యిం॥

మి॥ రీ గ మ పా ధ ని సా రి ని-సా రి గ.మా ప మ గ రి స ని
జంకెదనిన్నబలిమినప్రీతి-సల్పగ శాపముకతమున

దా పా మ గ పా మ గా రి - సా ని ధ ని స రీ ని గా రి ॥గా॥
శంకింపకునన్ను నీదు-కింకరునిగ నేలుకొమ్మ ॥యిం॥

1. పా దా మ దా పా మ గ రి - గా మ దా ని దా పా మ గ
త్రైలోక్యవీరుండనగు-రావణుండ నేనెక్కడ
రీ గ మా ప మా గ రి నీ - సా రి గ రి ని సా రి గా మ
వేల్పులికై నజాలని యా-పేదనరుఁడు రాముడేడ
దా ప మా గ రి గ మ గా రి - సా ని స రి గ ధా ధా ప మ
చాలుజాణతనములేని-చక్కదనము నీకెందుకు
ధా ప మా ప ధా ని సా ని-.గ రి స ని రీ స నీ ధా మ ॥గా॥
మేలెరింగినన్ను గూడి - మెలపునలంక బాలించు ॥యిం॥

సీ. కటులగోరమీాన మెగదువ్వచోయ్యార । మునను బోరవిరుచుకొనుచు నదరు

వానిఁ ఇంక గడ్డిపరకనొక్కటి బెట్టి । పరమసాధ్వి సీత పలికెనిట్లు.

దేశాక్షి-రూపకము.

ప॥ సా రీ గా మ ప ధా సా-సా నీ దా మా గా మ రి॥ సా॥
రామారాక్షసభీమా - బ్రాణేశా యెందుంటివి ॥రా॥

అ॥ దా మా గ మ రీ స రి గ మ-పా ద సా ని ధ రి స నీ ద ॥సా॥
ఈ మూాఖు డు కారులదువ-నెట్లుసైచి బ్రతుకుదాన॥ రా॥

చ॥ రీ గ మ పా ద స ని దా మ-గ్గా మ రి స రి గా మ ప దా
వేమరున్గ దరిదుబ్రిల్లు-వెరిబ్రిమిడతపోలికని
స ని ధ రి స నీ ధా మ గ-మ రి స రీ గ మా ప ద స రి ॥సా॥
తామసుడీటు నాచెంగట - తనబడాయిజూపెనహా॥ రా॥

1. ప ద మ గా మ రి సా ని ద-స రి గ మ ప ధ రి స నీ ధ మ।ప దస ని దా మా గ మ రి స-ద స రీ సా ని ధ మా
పరమనీచుడువీడెట-పరమపురుషుడవునీవెట । సరియగునా మెగ్గపురుగు జగతినూర్యునితో
గ మ రీ స ని దా సా రీ-గా మ పా ద సా ని ద మా । ప ద స నీ గా మా రి స నీ-దా మ నీ ద మ గ మ రి స రి ॥సా॥
దురితాత్మకుడీసాధు-ద్రోహి రాక్షసాధముడుగ్ ।నిరుపమసౌందర్యనిధీ-నీమహత్వమెరుగ గలడె ॥రా॥

గీ. అనుచుబరమసాధ్వియగు సీతపల్కిన । నంట వెరచిరావణాసురుండు
మరలెనిటులబాడుచిరుతలగనిశాంత।యనియె రామునితోడనద్భుతముగ.

మలహరి—త్రిపుట.

ప॥ రీ మా ప ద సా ద పా మ్మా-గా రి సా ధ స రి మ పా దా మ ॥రీ॥
అన్నాకన్నుగొంటివేయీా-చిన్నివారలనునిదానించి ॥యు॥

అ॥ పా ద మా ప ద సా ధ రీ గ రి-సా ధ పా మ గ రీ స రి సా ॥రి
ఉన్న వన్నియురూపు రేఖలు-నిన్ను సీతనుబోలి యేమో ॥య॥

మి॥ రీ మ ప ద ప మా గ రి సా ధ రి-సా రి సా ధ నా రి గ రి స ద
కన్నుగవలుకాటుకపుల్గుల-కన్న మిన్నలై జానకివలె

సా రి మ ప ద ప మ గా రి సా రి-ద స రి మ గా రీ మా పా మా గా రి॥
వన్నెయుమిగిలినయంగసౌష్ఠ-వమునకుసీతికే నీయచ్చె ॥య॥

1. దా ప మ గ రీ స రి స ధా రి-సా రి మ ప ద మ పా ద సా స
ఎంతపని జేసితివితండ్రి యింతినడవులకప్పగించి
రీ స గా రి సా ధ ప మా ప ధ-సా ధ పా మ గ రీ స రి స మ
యెంత జెప్పినంబిలిపించక-హీనవాత్మలకోడియుంటివి
గా రి సా రి మ ప దా సా ధా-రీ స గ రి స రీ సా ధా ప
కాంతయత్తయిలు పుట్టిల్లు - గాని యడవిలో సీతాక్షి
మా పా ద స రి స దా ప మ గ రి-సా రీ ద సా రి మా పా మా గా ॥రి॥
చింతాంబుధిబడి నామరదలు-జీవించుటెట్లో పన్నెం ।ఛేద్దు

గీ॥ అనుచునంతఃపురంబున సతిపతెల్ల
నెంతయుం జానకింగూర్చి యేడ్చుచుండ
నెడదనీరయి రాముడుంబుడుతలదెస
బలుమరుంబరికించి యిట్లులదలంచె.

యాగప్రియ—ఖండగతి.

ప॥ ని స రీ స నీ ధ పా-మా గ మ ప ద మ పా స ॥అ॥ ప మ గా రి
సా రి గా-మ ప ద ని రి ని సా రి ॥ని॥
అదియేమోకానియీ-యభర్తకులగనినంత ॥అ॥ నెక్కలోనవించెనా -
బాదలుచున్నదిక్షేమ ॥య॥

మి॥ గ మ ప ద నీ ద పా మ - గా రి స రీ గా మా-ప దా ప మ ప
దా నీ-సా రి స ని ధ ప మ గ రి ॥ని॥

పదపడియిక శాంత - బలికినయట్లేయా । విదేహసుతయేయి - ప్పిల్లల
గనదగినది ॥య॥

1. ప మ గా మ ప ద నీ స-రీ గ మా ప ద పా మ । ప ద ని సా రి స
నీ ద-పా మా గ రి స నీ రి

కుక్షినై పడరెనేత్ర-కోణమిప్పుడునాకు । కపదయన్విధిమంచి - గావిం
చునోకోనాకు

స ని దా ప మ గ రి గా-మ ప ద ప మ గ రీ గ మ
ప ద నీ సా రి స నీ-ద పా మ గ మ గ రి సా ॥ని॥

పక్షినిబ్బుడుతలునా-కొడుకులనుచుసీతయు। నడవిన్హాయిగను-న్నదం
చువినగలనో ॥య॥

గీ. అంతద్వారపాలుడధిపునితోననె। త్రిభువయిదిగో చూడుపౌరులెల్ల
దమకుజేయువిన్నపమిదెయనుచుబత్రి। మివ్వ దానిరాముడిట్లుచదివె.

సీ. స్వస్తిరామా నీకు జగదేకవీరుండ నిష్కళంక చరిత్ర నిరుపమాస
ధైర్యమందర సర్వధర్మస్వరూప సత్యపరాక్రమా కరుణాబ్ధినిఖిల
దుష్టసంహార శిష్టరక్షణలోల యాశ్రితమందార యవధరించు
ఒడలెరుంగని చాకినుడినమ్మినిర్మలసీతి రాజ్యంబు నెరుపగోరి
పరమసాధ్వియు బూర్ణగర్భవతియైన
జానకిన్విధివశమున గానలోన
నీవువిడిచిన మొదలు సువృష్టిలేదు
గనుక యామెనునీవేలుకొనుము మరల.

గీ. అట్లుచదివి రాముడా బాలగోపాల
ముగను పౌరులెల్ల మొనసి కోట
చెంతనుంటజూచి చిరునవ్వుతోలక్ష్మ
ణునకు నిట్టులనియె జనులజూపి.

హాటకాంబరి—రూపకము.

ప॥ పా మ గ రీ స రి స ర్రీ స- ని స రి గ మ ప దా ప మ ధా ॥పా॥
తమ్ముఁడా యీ జనము సేయు - తగవునుబరికించితివా ॥త॥

అ॥ నీ స రీ గ మా గ రి స ని-స రి స ని ధ ప మ గ ప మ గ మ ॥పా॥
సమ్మతింబ్రజానుమతము - సలుపవలయుఁగద నృపతికి ॥ద॥

చి॥ పా మ గ రి స ని స రీ గ మ-ప మ ప దా ప మా ప గా మ
సమ్ముదమునమునిపల్లెకు - జని మదాజ్ఞ జెప్పి వేగ
పా ధ ని సా ని ధ ప మ గ రి గా మ పా మ దా ప దా మ ॥పా॥
నెమ్మిని నీవదినెనిటకు-నీవు నేడుతోడి తెమ్ము॥ త ॥

1. స రి గ మ పా దా ప మ గ రి-సా రీ ని స రి గ మ గా రి
ఇనకులముంబట్టినశని-యిన్నాళ్ళకు వదలిపోయె
స ని ద ని రి స ని ధ ప మ గా - మా ప గా మ రి గ మ పా ద
వనమున శుభశకునములం-బట్టి సీతబ్రతికియుండు
ని స రి గ మా పా దా నీ-స ని దా ప మ గా రి సా ని-స రి గ రి
గా మా ద ప దా-ని ప ద మ పా గా మ రీ స ॥పా॥
ననుకొనెదన్నే నే స-త్యపరాక్రమశాలినైన। జనసుతసంతానముతో
జనకజ నంజేరుగాత ॥త॥

గీ॥ ఇట్లు లక్ష్మణుబంపించి యెల్లపౌరు। లుల్లసిలగుశలవులచే నాసరాము
డాత్మచరితంబువినుచుండెనంతటముని। పల్లెలో సీతయిబ్భంగివనరుజొచ్చె

శ్యామలాంగి-రూపకము.

ప॥ సా రి గా రి సా నీ-సా రి గా మ పా మ గా రి ॥సా॥
ఏమిసేయుదునో ప్రా-ణేశునొద్దకేగివాని ॥యే॥

అ॥ సా నీ ద పా మ గా రి స-నీ స రీ గ మ గ రి నీ ॥సా॥
నాముద్దుకూనలంగని-నాథుడెట్లు తలచునో ॥యే॥

ఋ॥ పా ధ ప మా పా ధ నీ స-రీ గ రీ స నీ దామా।పా ధ ని సా రి గ
మ గ రి-సా నీ ధ ప మా గ రీ ॥సా॥
పామరలోకాపవాద-పాతగిల్లెనో లేదో। వామభుజంబద రెడునా-భా
గ్యంబికపండునో ॥యే॥

1. ప మ పా ద ప మ ప మా గా-రీ స నీ స రి గ మ ప ద మ
మునుపంతటి యెడబాటుఁ బొందియైన మరలవిభుని
గ రి స ని సా రి గ సా రీ-దా మ ప దా పా మ గా రి
గనినటులిప్పుడు రాముఁ-గందునో నాపుణ్యమేమొ
స రి గ రి సా రీ గా రి స-గ మ ప మ దా ప మ గా రీ।స ని స రి
గా రి స నీ స రి గా మ ప మా గ రి సా నీ॥సా॥
మనసునకేమోహధైర్యము-మరిమరిబుట్టుచునుండెఁ। గనుబడుచున్నది
సర్వజ-గంబది రామమయంబై ॥యే॥

సీ॥ నాథునితోడ నన్గలిపినచో నీకు భూదేవి ముత్యాలముగ్గువెతు
సూర్యుడా రామునిజూపుమా నీకు గాగెడుగోవుపాలారగింపు సేతు
ఎరునినఁగూర్చుమా తిరుపతీశ్వరనీకు మొహారులనొకకోటిముడుపు
దాతు
ననువిభునింజేర్చఁ కనకదుర్గా నీకు గరిసెడు సన్నచెందిరము పూతు
ననుచువేల్పులకు(న్)మ్రొక్కుఁబెనిమిటిదగు।వర్తమానంబుగోరినల్వంక
లరయు
శకునములఁ౦చిగాజూచి సంతసించు।జానకియిటుండనటకు లక్ష్మణుడు
వచ్చి॥

సీ॥ పిరుదులమీరి యుపేక్షింపబడునెరి కొనలందు ముత్తైపుచినుకుతోడ
సంతతబాష్పపరిచారతనాసిజాడలు వడి వాడు చెక్కిళులతోడ
అన్నపానసుఖంబు లంటకకళదప్పి మిక్కిలిచిక్కిన మేనితోడ
నలుదట్లగాటుకే పులుగుల బెర్లింపదొడరిన బెదురుకందోయితోడ

స్నానమయి నారచీరెను సగముగట్టి
మిగలినసగంబు నొకపొదమీదనార
వైచి నిలుచున్న సీతనుజూచి కొంత
వడికి రామానుజుడు పోల్చిపల్కెనిట్లు.

సేనావతి-చతురశ్రిజాతి త్రిపుట.

ప॥ దా ప మ గా రి స-నీ సా రి గ మా । పా ద ని సా నీ - దా మ ప గ మ్మా॥ దా॥

రాముడునీదగు-ప్రాణేశుడుశీఘ్రమ్మునవిన్ను-గ్రమ్మెనెనమ్మా॥ రా॥

అ॥ పా మ పా దా మ-పా ద నీ స రి స । రీ గా మ గ రీ-స ని దా ప మ పా ॥దా॥

భూమిజానన్ను - బోల్చులక్ష్మణుడ । నా మోదముతో నరుదెంచుము శ్రీ॥రా॥

చి॥ మా ప ద నీ స రి గ రి సా గ రి నీ-స గ రి గా మ పా మ గా రి గ మ పా

పామరనింద యినకులంబునకున్ - వదిలె నిన్నినాళ్ళ కేశు కరుణన్

ధా ప మ పా ద నీ స నీ గా రి - సా ని ధ ప మ గా రీ సా రీ గ మ॥ దా॥

వేమరునోముపండె నీగన్న-పిల్లలెచటనున్నారో తెల్పుమ ॥రా॥

గీ॥ అనుచు దారసిల్లు నాలక్ష్మణునిబోల్చి
పొలతియమృతంబు మోదఖేద
ములు మనంబునందు ముప్పిరిగొన గొంత
వడికి నతనితోడబలికెనిట్లు.

దివ్యమణి-రూపకము.

ప॥ దా ప మ గ రి సా నీ స రి-గా మా ప మా ద పా ॥దా॥
రాము కరుణ యిన్నాళ్ళకు - నామీదవచ్చెనా ॥రా॥

అ॥ మా ప దా ప మా గ రి సా-నీ స రీ గ మా ప మా॥ దా॥
కామకోటి సుందరు నా - కాంతునింక జూతునా॥ రా॥

మి॥ దా ప మ గా రి సా రి ని స-గా రి స నీ ద నీ
పామరలోకమాడు నప-వాదయడంగెనా
సా రీ గ మా ప మా గా-దా ప మ ప ద నీ రి నీ॥ దా॥
నామంచితండ్రినాకీ-నాటికి శనియూడెనా॥ రా॥

1. ప మ గ రి సా నీ దా ని స-ని స రీ గ రి సా రి గా
వదినెయు నాచెల్లెండ్రు మ-రదులందరు సేమమా
ద ప మ ప మ గ రి స నీ స రి-గ రి స నీ స రి గ మ గా
సదయుడమనపురమందలి-జనములెల్లసుముఖులా
మ ప ద ప దా నీ స ని దా-పా మ గ రీ స నీ స రి గ
పదపడివాల్మీకియునా-బాలురయోధ్యకేచనిరి
ధ ప మా గా రి స నీ స రి-గా మా ప మ గా రి స రి ని॥దా॥
పదమావేగమెనాధుని-పాదంబులముద్దిడవలె॥ రా॥

గీ॥ అప్పుడు మునిపల్లెలో నున్న యతివలెల్ల
మిగుల నద్భుతమంది సౌమిత్రిచేత
సకల వృత్తాంతము నెరింగిజనకజాత
కనిరిభయభక్తులన్మీరియతిముదమున.

## జ్యోతిస్స్వరూపిణి-రూపకము.

ప॥ దా నీ సా నీ ద ప మా-ప ద ని స రీ స ని ధ నీ ప॥ దా॥
అమ్మా మన్నించుము ని-న్నలతిగజూచితిమితొల్లి॥ న॥

అ॥ మా ప మా గా రీ స ని దా-నీ సా ని రి స ని ద ని ద ప॥దా॥
ఇమ్మగ శ్రీరామునకీ-విల్లాలవనుచు దెలియక॥ య॥

మి॥ పా మా ప ధ నీ సా రి స-రీ గ మా ప ధా ప మ గా।రీ స ని ధ
ని స ని ధా ప మ-గ మ ప ధా ప మ గా రీ ని॥దా॥
ముమ్మాటికికనింబోలిన - ముద్దులూరుపుణ్యసతికి। నెమ్మనమున స్మరి
యించిన-నిఖిలపాపములుంబాయు॥ స॥

పా మ గా మ పా ధా ని-సా ని దా ని స రి స ని ద ని
ఏమిపాపమో-కాని-యింతదానవని యెరుగక॥

దా ప మా గ రి స ని దా - నీ సా రీ గా ప ద మా
యేమునిన్నుజుల్కనగా - నిన్నాళ్లుంజూచితిమా

గా రి స ని ధా ని సా ని ద - పా మ గా మ ప ధ ని సా ని । రి స
ని రి సా ని ధా ని ప - దా మ గ మ ప ధ నీ స ని ధ ని ప ధా॥
నీమగనితోడపోయిగ - నీవుశాశ్వతముగనుండు । మోముగువ మాకు
నీవలె - నుత్తమసఖియికెట్టుదొరుకునె ॥య॥

సీ॥ శ్రీరామునిసతివటె నీవని - ముద్దిడిదీవించెముసలిదొకతె
నెచ్చెలీనిన్నికనే నెప్డుజూతునోయని కంటనీరిడెనతివయొకతె
నికదుస్తుమడవేసి చీరగట్టంబెట్టి పసపుగుంకుమకాన్క నొసగెనొకతె
చెలియరో యీజంతికలు కుశలవులకు బెట్టుమాయనియొడిగట్టెనొకతె
యిట్టులద్భుత మోదంబు లెనసివిడువ
జాలకుండినయవ్వానిసతులకెల్ల
తనకు సౌమిత్రి దెచ్చిన ఘనవిభూష
ణంబులంబంచియిచ్చి సీతమ్మయనియె.

కాంతామణి - త్రిశ్రగతి.

ప॥ పా మ గా రి సా ని స రి గ - దా నీ సా నీ ద ప ధ మ ॥పా॥
అమ్మలారవందనమిదె - యీపాటిమిమ్మెట్లువిడుతు ॥న॥

అ॥ సా ని ధ పా మా గ రి గ మ-దా మ గా రీ స నీ స రి ॥పా॥
సమ్మతినాపిల్లలనను-జాలబ్రేమించిపెంచిన ॥య॥

చ॥ దా ప మ పా ధ ని స రీ స - రి గ మ ప మ గ దా మ గా రి
సా ని స రీ గా మ ప మా-ప ద ని సా ని దా ప మ గ మ ॥పా॥
నెమ్మనినాపురుడుబోసి-నిరతముపరిచర్యసేసి। యిమ్ముగరక్షించిరిమీ-
ఋణమ్మునాకుదీర్చఁదరమె ॥య॥

1. సా ని దా ప మ గా రి స ని-స రి గ మా ప దా మ గా రి
అట్టికష్టసముద్రమున - నడగియున్న నన్ను దేల్చి
సా రి ని సా రి గా మ గ రి-దా మా గ రి సా రీ నీ
పుట్టిలుకన్న నెక్కువగ-బోషించినమీాయూరిక్
సా రీ గా మా ప మ- గ రి-స ని రి సీ ద పా మ గ రి స
కట్టానేనెట్లుమరువ-గలను బ్రాణమున్నవరకు
నీ స రి గా మ ప గ మా ప-దా మ సీ ధ పా మ గ రీ గ మ॥పా॥
మెట్టున నేటికొకసారి మిమ్ముజూడవచ్చెద నిచ్చటి ॥క॥

క. మునిసతులయొద్ద సెలవిటు
గొనిజానకి మరదితోడ గొబ్బునరథమె
క్కెను బదప నయోధ్యనుగా
మునిగని వాల్మీకిపూజబొందియిటులనెక్.

నాసికాభూషణి-సంకీర్ణగతి.

ప॥ సా ని ద ని స నీ ద ప ద ని దా ప మా గ-రీ సా ని రీ స ని ధ
ప మా గ మ ప ధ ని ॥సా॥
రామసుగుణధామ యినకులాబ్ధిసోమ - యీాముద్దుపిల్ల లెవరోనీకు
దెలియున ॥రా॥

అ॥ సా రి గ మా ప దా ని సా ని ధ ప మా గ-మ ప ధా ని పా ద
సీ ద ప మ గ రీ స ని ॥సా॥
వేమరుపీంద్రునీచరిత్రజవులూర-వినిపింపబేమబొందివిడువకుంటివి॥రా॥

చ॥ రీ గ మ గా రి స।ని ద సీ స ని ధ ప।మ పా ధ సీ స ని।రీ స ని రి
ని । దా మ ప మా
శ్యామలవర్ణము భుజసౌష్ఠవముపలు। చాలుసీలపుటుంగరముల। ముం
గురులుక్

గా మ ప దా ని రీ స ని దా ప మ గా రీ స ని సా రీ గా మా
పా ధా ని రి ॥సా॥

వేమాట లేలనిక్కవపిల్లలునీయచ్చుగనున్నారో లేదో చూడుమ ॥రా॥

ప మ గ మ ప దా ని స ని దా రీ స ని రి స-ని ద సీ ద ప మ
గా మ పా ద ని స రి స ని

కనుగవలతీ రెవరిదో పోల్చుకొనుమ-కటసాధ్వియగుసీత నేలవిడిచితివి

ద ని ప దా ప మా గ మ పా ద సీ రి స ని-గ రి సా ని ధ ని స
రీ స ని దా ని ధ ప మ

జనపతీనిజంబుగవీరునీసుతులు-సహజాస్త్రవిభవులన్నిటనీకు సములు

చ॥ ప ద ని స రీ గా మ గ రీ సా ని దా సీ ధ ప మ-గా రి గ మ ప
దా ని సా ని రి ని

కనుగొనుమావీరలనీజన్మసాఫల్యముగ నం-కతలము జేర్చి-ముద్దిడుము

స రి గ మ పా దా ని స రీ స ని దా పా మ గ రి స సీ స రి స ని
ద పా మ ప ద సీ ॥సా॥

జనకజనీకై పలవించుచు నాయాశ్రమమునసున్నది తిరిగి యేలుకొను
మా ॥రా॥

గీ. భళిరమీావంటిపుణ్యదంపతులుకష్టపడిరియిన్నాళ్లుదుర్విధివశముచేత
గానియిప్పుడుసంతోషకాలమయ్యె । నాలుబిడ్డలతోనీవుహాయినుండు.

క. అనవినిగొబ్బునగుశలవులనుగౌగిటజేర్చి ముద్దులంగొని రాముం
డనుపమసంతోషాంబుధిముసింగిమునితోడ గేలుమోడ్చి యిటులనె.

శారదాభరణము - సంకీర్ణగతి.

ప॥ స మ గ మ ప ద సీ సా రి సీ ధ ప మా-రీ స మ గ మ ప ని ద
ని సా రి సా ని ధ ని ॥స॥

అనుపమకరుణాంభోధీనేనినుగొని-యాడగలనెయినకులముద్ధరించితివి॥అ॥

అ॥ స ని ధ పా మ రీ స ని స మ గ మ ప దా ని-స నీ రీ స ని రీ ని
సా ని ధ ని సా ని ॥స॥
మునివరుండ దుర్విధిహతుడనగునన్ను-బునర్జీవితుజేసె నీయమృతదృష్టి

మి॥ రి స నీ స ని దా ని ధ ప మ రీ స మ గ మ ప ధ ని దా ప మా
పా ద నీ సా ని దా
జనులందరు సీతపరమసాధ్వియనుచుమరలనాపెబిల్పించి నన్నేలుకో

ని స రీ స నీ ద ప మ రి స నీ స మా గా మ ప ద నీ దా ప మ
పా ధ ని సా ని రి ॥సా॥
మ్మనివీండుశ్రీనాతనయులనిపోల్చికాబోలు ననుబాధ్రించి రిదంతయు
నీకృప ॥ని॥

గీ. అంతలక్ష్మణుతో సీతయరుగుదెంచి
యఖిల పౌరసభామధ్యమందుసమయ
మెరిగివచ్చిన ఋషులునుతింప గుశ ల
వులను ముద్దువిభుగని తలచెనిట్లు.

గాంగేయభూషణి - రూపకము.

ప॥ స ని ధ పా మ గా మ ప మ గ-రి స ని సా రి గా మ దా ప ॥స॥
సుదినమయ్యె నేడువిభుని-సుతులతోడజూడగల్గె ॥సు॥

అ॥ మ గ మ ప దా నీ స రీ స-రి నీ ధ ప మ గ రి సా ని ॥స॥
పదపడియున్నాళ్ళకాస-ఫలించెజన్మముదరించె

మి॥ ద ప మ గ రీ సా రి గా మ-ప ద నీ స ని దా పా మ గ
ముదమున నేగొల్చు వేలు-పులు సత్యముగాపాడిరి

రి స రీ స ని స రి గ మా ప-దా ని స నీ ద ప మా గ రి ॥స॥
కద నాకికకొరతలేదు-కాంతునిగూడిసుఖించెద ॥సు॥

సీ. అప్పుడుసీతనుజూచి హాహాపతివ్రతాభూషణమా యని మ్రొక్కువారు
అతిసుకుమారాంగివమ్మ ఘోరాటవినెట్లుంటివంచు శోకించువారు

నీయంత మంచిదానికి నిందెగల్పించె నేతల్లి యనివిధించ ట్టువారు
నీ భర్త యున్నీవు నీసుతుల్ప్రతుకుడు వేయేడులనుచు దీవించువారు
ఇట్టులద్భుత మోదంబు లెనసిపౌరు లెల్లదనుగనుచుండగ నింతినాధు
నంతికము జేరిరాముని యంకతలము దిగి యెదుర్వచ్చు సుతులతో నగియి-
టులనె॥

చితాంబరి - చతురశ్రగతి.

ప॥ దా ప మా గ రీ సా ని స రీ గ రి-గ మ ప ద నీ రి సని ద ప॥దా॥
అన్నలార మిమ్మంకము జేర్చిన-యత డెవరో తెలిసితిరా॥ య॥
అ॥ పా మ గా రి సా నీ స రీ గ మ ప-దా ప ధ నిసగారిసానిరీసీ దా॥
చెన్నుమీర మీ కన్న తండ్రి జగ-జెట్టియితడె నాదు ప్రాణనాధుం॥డ॥
మి॥ గా రి గ మా పా మ గా రి సా ని-స రి గ మ ప దా ని దాప ద
ని స ని ద॥
ఎన్నక ఘోరాపవాదమాడి-యిడుములకు నన్నుద్రోయుజనములకు
పా ద ప మా గా మా పా ని స ని-రీ స గా రి పా మ ద ప మ
గా రి ని ॥దా॥
బన్నుగ మత్పాతివ్రత్యమిపుడు-స్పష్టపరచితల్లిఋణము దీర్చిన ॥య॥

సీ॥ అపుడు శ్రీరాముడఖిలజనాళిమిగుల
సన్నుతింపగ జానకి నన్ముదమున
తనదు వామాంకమున జేర్చి తనయులలర
బలికెనిటు మేఘగంభీర భాషణముల.

తానరూపి - చతురశ్రగతి.

ప॥ గా మా ప మ గ మ పా దా నీ స సి-సా గ రి సా ని ద-నీ స ని
దా ప మ ॥గా॥
ప్రాణేశ్వరిమన-పై నిన్నాళ్లకు-దానను కూలత-దైవము పొందెను॥ ప్రా॥

అ॥ పా మ గా మ గ రి-సా రి ని స రి గ మ-పాధ నీస ని ద-రి స ని
ద ప మ గ మ ॥గా॥
కానినిందెమునుగల్గినకతమున-నేనునీసుగుణ-మెరిగియు విడచితి ॥పా॥

మ॥ గా రి స నీ స రి గా మ పా ధ నీ ద-పా మ దా ప సా ని రీ సా రి ని ద॥
మానుగనీవనలముజొచ్చినీదు-మంచిమాకునాడుకన్పరచినటు
నీ స రి గ రీ స నీ ద పా మ గా - మ ప ధా ప మ గా రీ స నీ స రీ ॥గా॥
వానగురిపించినీసతీత్వమి-ప్రజకిప్పుడుస్పష్టంబు సేయుమా ॥ప్రా॥

గీ. అపుడు రామాజ్ఞ చొప్పున నవనిజాత
నాణెముగ బైటకొంగున నడుముగట్టి
నిలువబడిఫాలమందు జేతులుమొగిడ్చి
స్పష్టముగసభనుజూచి శపథముగ్లకె.

మానవతి-త్రిపుట.

ప॥ గ మ ప ద ని సా నీ ద్హా ప మ-గా రి స ని స రి గ మ పా మా
పరమఋషులారా రాజన-భానదులగు సుజనులారా॥
ప మ ప దా ని స రీ గ మా గా-మా ప ధ ని రి స ని ధ ప మ గ రీ ॥గ॥
వరసతీత్వనిరూఢికై నే-బల్కుశపథమునరిగ వినుడీ॥ప॥

అ॥ ధ ప మ గా రీ సా ని సా రిస ని ధ నీ ధ ప మ ప ధ నీ సా
నిరతముశ్రీరామపాద-సరసిజంబులు మరువనేనిక
రి గ మ పా దా నీ స నీ ద ప-మ గ రి సా ని రి సా ని సా రీ।
మరియునేరామాజ్ఞదప్పక- ధరణిలోజరియింతునేనిక।

మ॥ గ మ ప మ ప ద నీ సా ని దా ప-దా ని స రీ స ని స రి గా రి।
సురుచిరముగ నేసాధ్వినైన-చోనిపుడొక్క-గడియలోన
స ని స దా ని ప ద ని సా ని దా-రి ని దా ప మా గ రీ సా ని
స గా మ ॥గ॥
గరువుదీర బ్రిజకుహాయిగా-గురిపించుగాతబజన్యుడువాన॥బ॥

వ॥ అంతనేకిన తెల్లదూదిపింజలచెలం-బూచిన రెల్లుభంగి నెండవైచిన క్షీరాబ్ధిపట్టుపుట్టంబుల బాగున-బాలగువ్వలకదుపుల మాడ్కి నురగలన్నెచు కడలికరటంబుల కరణి-బొరలు రేగు శ్వేతాభ్రకంబుటచ్చులపోల్కి దరతరంబులుగ హెచ్చుతగ్గులనమరుచు కెరడువారినపర్వతశిఖరంబులచాడ్పున-వెల్లవేసినని మొన్నన్నతంపు మేడ బాజులపోలపున-నలుదిక్కులనుండి నిగుడాంబయ్యునారాయణుతీరున శ్యామలంబుగ గన్పడుమింటికొప్పున కెగ్రబాకు ధవళమేఘపుంజంబులు తేబచ్చికబీడుల తెన్నున - దేనెపట్టులసొబగున-నీల వితానంబులవిధంబున నీలిచేలసొబగున - ననరటితోటల తెరగున-కాటుక బానువట్లుగాగ్రొన్నుచు దళచుగనేకంబై చదలల్లి-చీకటులుగ గ్రమ్మసర్వప్రాణులతాపంబులు వాయుమున్మురంబుగ నీటిగాలి వెదజల్లుచు-జూనుక్కలు మిరుమిట్లుగొల్పు మెరపులనెంబడిం జెవులుచెవుడువరచు నురుములతోడనె నేలంగమ్మనితావియెసగబడబడమని మొదటం బెద్దజల్లెడజల్లునటువలుదచిన్కలవ్వెనభూనభంబులకు వెండితీగులుబిగించినతీరునధారలుగట్టిపలువిధశబ్దంబులనొక్క మొగిబొత్తాళంబు త్రివ్వనట్లు వానగురిసి వేసవింగెలిచి వెల్లడించుజయపతాక తెన్నునజానకీపాతివ్రత్యమహిమంబు ముల్లోకంబులకుం దెలుపు శాసనపత్రిక మాడ్కి నిండ్రధనువలరించిన.

సీ. పల్లమువంక దాకబ్రవర్తించె నీర్విశేష్యముజాడజను విశేషణముభంగి
నడవి కాచిచ్చులకా దేశమైకొండవరదయాగమమయ్యె జెరువులకును
అలప్రకృతిప్రత్యయములట్టు లన్యోన్య మెడయ కేళ్లుంగాల్వలేకమయ్యె
కర్మభావప్రయోగంబులందప్పని యాత్మనేపదమట్టులలరెగప్ప
వడి నలౌకికవిగ్రహవాక్యముచెలె।గోకిలరవ ప్రయోగంబు లేకయుండె
బల్లవితబహువ్రీహిసంపటలమగుచు।బ్రబలి వ్యాకరణమువలె వాన వెలసె.

ద్వి॥ అంతట సీతామహత్వంబు మునులు
సంతోషమున నెల్ల జనములు వొగడ

2. రామానుమతిబొంది పాత్రిచేతసుండు
నామోదమునన యోధ్యాపురంబునకు

3 వైదేహీతనయులై పట్టభద్రులని
నాదరంబున బల్కి జనులుల్లసిల్ల
4 చెలగి మౌనులకడ సెలవును బొంది
ఒలుసభ చాలించి బాంధవకోటి
5 సంతసంబందగ జానకీరాము
లంతనన్యోన్య సౌఖ్యము బొందిరిటుల
6 జానకీరాముల సచ్చరిత్రంబు
మానుగ నెందరో మాన్యులు తొల్లి
7 నిరుపమానకవిత్వ నిపుణతతోడ
విరచించిరై నను విప్రలభవాబ్ధి
8 దరియింపగోరి యిద్దాని జేసితిని
ధరను నారాయణదాసుండ నేను॥

క॥ కరుణాకర రాక్షసభీకర సీతారామపాదకంజమధుకరా.
చిరజీవ యచలభావా । గురు నీకృతిదప్పుసైచుకొనుమా హనుమా॥

తోటకము.

సర్వవిద్యానిధీ నిత్యవాక్యవ్రతా । గర్వితారాతి మేఘప్రచండానిలా
పూర్వరుద్రాంశసంభూత తేజోమయా । పర్వరీణాత్మజాభావిపద్మాసనా॥

రూపవతి-మిశ్రగతి.

ప॥ దా ప మా గ రి స నీ స ని స రి గా మ-పా మ గా రి సా ని దా
ప దా మా॥ దా॥
ఆంజనేయ భంజితాసురసముదాయ-మంగళంబు నీకు మంగళంబో॥ యా॥
అ॥ పా ద ని సా ని ధా-మ గ రి ని సా రీ ని॥ దా॥
మంజులగానసం-ప్రముదిత త్రైలోక్య॥ మ॥
మి॥ ధా ప మ గా రి సా రి స రీ గ-మా ప సా ని ధ నీ స ని దా ప
పింజరవర్ణ భాసుర దేహా-భీత భూతపిశాచసమూహా
నా ని ద నీ స నీ ద నీ ద ప-మా గ దా ప మ గా రీ గ మ ప॥ దా॥
రంజిత సర్వదేవతాచయ - రామనామజపానందమయ॥ మం॥